విశ్వసాహిత్యమాల 69.

# ఆంధ్రగాయకుల చరిత్రలు.

రచయిత:
చతుర్భాషాకోవిద, నానారాజన్యవిద్వత్సభా
పదవీవిభూషిత, ప్రభుత్వ గానపరిశోధక.
నాదసుధానిధి మంగిపూడి రామలింగశాస్త్రి

1957 సెప్టెంబరు.

విశ్వసాహిత్యమాల-రాజమండ్రి

# Biographies of Andhra Singers.

*By*

*Nadasudhanidhi M. R. Sastry.*



శ్రీ మంగిపూడి రామలింగ శాస్త్రిగారి యితరకృతులు.

1. హైందవ గాయకేతిహాసములు.
2. రాగమాల.
3. హిందూస్థానీ గానపద్ధతి.



ప్రథమముద్రణ 1000 ప్రతులు. వెల రు 1/-

# ఆ ము ఖ ము



విఖ్యాత కళాకారుల జీవితచరిత్రలను రచించే ఆచారం పాశ్చాత్యదేశాల్లో ఎక్కువగా ఉంది. బాస్వెల్ వంటి రచయితలు జీవిత చరిత్రలను రచించే గొప్పఖ్యాతిని ఆర్జించుకొన్నారు. మనదేశంలో ఇట్టి రచనారీతి కొరవడి ప్రముఖులైన గాయకులు దైవభక్తి పరాయణులై ఉండడంవల్ల వారు తమ జీవితవిశేషాలను స్వీయచరిత్రల రూపంలో రాసుకోలేదు. వారికి తమ జీవితాలు, తాము సంగీతరంగంలో చేసిన కృషి పదిమందికీ తెలియజేసుకోవాలనే ఆకాంక్ష ఉండేదే కాదు. ఆత్మ తరణానికి సంగీతం ఉత్తమ ఆలంబనంగా భావించి వారు నిర్మల చిత్తంతో ఈ మార్గాన నడిచారు. అయితే వారి జీవితచరిత్రలు మన కందరికీ తెలుసుకో దగినవి. ఆ మహామహుల జీవితాలు మనకు మార్గదర్శకాలై మనలో నూతన ఉత్తేజాన్ని కలిగిస్తాయి. గాయక శిఖామణులైనవా రనేకులను గురించి మనకు తెలియదు.

బ్ర॥ శ్రీ॥ మంగిపూడి రామలింగశాస్త్రిగారు "ఆంధ్ర గాయకుల చరిత్ర" లను పేరుతో త్యాగబ్రహ్మనుండి నిన్న మొన్నటివారి దాకా గాయకుల జీవిత చరిత్రలను సంగ్ర

హంగా కూర్చినారు. శాస్త్రిగారు గాయకులుగా నటకులుగా సంగీతశాస్త్ర పరిశోధకులుగా ఆంధ్రగాయక లోకానికి సుపరిచితులు. ఇప్పుడు ఈ గ్రంథ రచనతో చక్కని జీవిత చరిత్ర రచనా దక్షుడుగా కూడా ఈయన మనకు చూపట్టుతున్నారు. ఇది మరొక విశేషం. ఇది ప్రశంసించదగిన కృషి. ఈ సంపుటి ప్రజలకు విఖ్యాత గాయకులను గూర్చి తెలుసుకోవడంలో చాలావరకు తోడ్పడగలదు. రెండవకూర్పులో మరికొన్ని విశేషాలుచేర్చి సంపూర్ణంగా ఉండేట్టు ఈ సంపుటాన్ని తీర్చిదిద్దవలసినదిగా రచయితకు నా మనవి.

హైదరాబాద్
30 మే '57

వింజమూరి వరదరాజయ్యంగార్.

---



ఆంధ్రుల ఇలవేల్పు శ్రీరామచంద్రునికి
భక్తిపూర్వకముగా సమర్పితము.

# తొలిపలుకు



'నాంతోऽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప!' అని గీతలో చెప్పినట్లు ఈశ్వరుని విభూతు లనంతములు. భగవదంశా సంభూతులే మహాపురుషులని సనాతనసంప్రదాయము. కాళిదాసు, భవభూతులవంటి కవులు; బుద్ధుడు, శంకరునివంటి తత్త్వవేత్తలు; జయదేవ, నారాయణతీర్థ, త్యాగయ్యలవంటి నాదయోగులును మనదేశములో జన్మించుటచేతనే భారతావని ధన్యమైనది.

మహాపురుషుల జీవితముల నాధారముగా గొని, వారి అడుగుజాడ లలో మన జీవితములను దిద్దుకొనినచో మనమును ధన్యులము కాగలము. మహాత్ముల జీవితచరిత్రలు పఠించుటలో ఉద్దేశ్య మిదే.

ప్రాచీనకాలమునుంచిన్నీ సంగీతము, నాట్యము, శిల్పము మొద లైన కళలు మనదేశములో వర్ధిల్లినవి. అనేక యితరదేశములకు నాగరకతా భిక్ష పెట్టినది భారతావనియే.

మన ప్రాచీన మహాపురుషులు తమ వ్యక్తిజీవిత విశేషములను వ్రాసి యుంచుట అరుదు. జీవితచరిత్రలను వ్రాయుట ఇటీవలి పాశ్చాత్యపద్ధ తియే. యూరోపా సంగీతవిద్వాంసులైన బీథోవెన్, మొజార్ట్, హాండెల్ మున్నగువారి చరిత్రము లెందరో ఆ దేశములలో వ్రాసి ప్రకటించిరి.

కర్ణాటక గేయకర్తల చరిత్రలను సంక్షిప్తముగా వ్రాసి మార్గదర్శకు లైనవారు శ్రీ సుబ్రామదీక్షితర్, తచ్చూరి సింగరాచార్యులుగారలు.

శ్రీకృష్ణదేవరాయల యనంతరము తంజావూరు రాజధానిగా పాలించిన నాయక, మహారాష్ట్ర ప్రభువులు కవిగాయక శిల్పసత్తముల నాంధ్రదేశమునుండి రావించి, పోషించి మించిరి. ఈ రీతిగా ఆంధ్రులు సంగీతశాస్త్రాభివృద్ధికి పాటుపడినవారిలో ముఖ్యులైరి. అట్టి సీమలోని తిరువయ్యారు అనే పంచనదక్షేత్రములో సంగీతత్రిమూర్తు లుదయించి దేశమునకు కీర్తి దెచ్చిరి. ఈపుణ్యక్షేత్రములోని దైవము శ్రీత్యాగరాజేశ్వ

రని అనుగ్రహవిశేషముచే గాబోలు తిరువయ్యారులో అనేకులు సంగీత శాస్త్రజ్ఞులు, నాట్యకళాభిజ్ఞులు, భక్తులు, కవులు, వేదాంతులు, సన్యాసులు వెలువేరి వన్నెకెక్కిరి. అట్టివారిలో ముఖ్యులే త్యాగయ్య, శామశాస్త్రి, ముద్దుస్వామి దీక్షితులు.

ఉంఛవృత్తిచే జీవయాత్ర గడిపిన త్యాగయ్య, దేవాలయ పూజారి యైన శామశాస్త్రి, రాజాశ్రయమును వలదని త్రోసిపుచ్చి స్వతంత్ర జీవనమునే వరించిన ముద్దుస్వామి దీక్షితులు, తమ జీవితములద్వారా మహత్తర సందేశములను మనకందించినారు. ఈ మహనీయులతో భారతీయ గాన చరిత్రలో స్వర్ణయుగము వెలసినది. వీరు నాదోపాసకులై, భక్తిగానముల యవినాభావమును వెల్లడించి, గేయకర్తలై ఆచార్యపీఠముల నలంకరించి తరించిరి. భక్తివినా సంగీతము వ్యర్థమని చాటి చెప్పిరి.

ఈగ్రంథరచనకు వలసిన విషయములు చేకూర్చుకొనుటలో ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రికలును, శ్రీ మల్లంపల్లి, వేటూరి, తిమ్మావఝుల, వింజమూరి, రాళ్లపల్లి, హరి ప్రభృతుల రచనలును నాకెంతో తోడ్పడినవి. వీరందరకు నా కృతజ్ఞతావందనము లర్పించుచున్నాను.

ఈగ్రంథ ముద్రణవిషయమై తామై పూనుకొని నన్ను ప్రోత్సహించిన శ్రీ మహీధర జగన్మోహనరావు, విశ్వసాహిత్యమాలా సంపాదకులకు ఎంతయో కృతజ్ఞుడను.

రచయితను గాకుండుటచే యిందులో ఎన్నియో లోపము లుండ వచ్చును. వాటిని విజ్ఞులు సూచించినచో మలిముద్రణమున సవరించు కొందునని మనవి.

ఓం తత్ సత్.

కొవ్వూరు
1–5–1957

ఇట్లు,
మంగిపూడి రామలింగశాస్త్రి.

# విషయసూచిక



ఆంధ్ర వాగ్గేయకారచక్రవర్తి

శ్రీ త్యాగయ్య.

# ఆంధ్ర గాయకుల చరిత్ర

## ఆంధ్రవాగ్గేయకారచక్రవర్తి, త్యాగయ్య.

## (1759 – 1847)

గానవిద్యాప్రపంచములో అనాదినుండి గౌరవప్రతిష్ఠల కాలవాలమైన మన తెలుగుసీమ కంతకునూ గొప్పకీర్తిని సంపాదించిన మహానుభావుడు గాయకచక్రవర్తి త్యాగరాజు. "సత్క్రియాచరణము, భక్తి, తత్త్వవిచారణ, యోగాభ్యాసమనే సాధనలలో నొకటినిగాని అన్నింటినిగాని అవలంబించి జీవన్ముక్తుడవు గమ్ము" అను భగవద్గీతా ఆదేశానుసారము భగవత్సామ్రాజ్యమును సాధించినవాడు త్యాగయ్య. దయారససంకలితచిత్తవృత్తి కలిగి, భక్తితన్మయతతో శ్రీరామచంద్రుని గుణగానమును చేసిన వానికి ఆత్మ సాక్షాత్కారమును కలుగజేసే శక్తి గానమునకు గలదని చాటినవాడు త్యాగయ్య. జ్ఞాననిష్ఠగల సాంఖ్యులచేతనూ, యోగుల చేతనూ పొందబడెడి ఉన్నతనిర్వాణస్థానమును (Beatific ultimate state) నాదోపాసన ద్వారా పొందవచ్చునని లోకమునకు బోధించిన గాయకబ్రహ్మ త్యాగయ్య. సంగీతజ్ఞానము, భక్తివినా సన్మార్గముగలదే మనసా !" అను కీర్తన ద్వారా లోకమున కొక మహత్తరసందేశము నిచ్చి, అంద

రినీ తరింపజేసినవాడు త్యాగయ్య. ఆంధ్రభాషామాధుర్య మునూ, ఆంధ్రకావ్యరసామృతమునూ, ఆంధ్రగానానంద మునూ తన కృతులలో ఏకస్థాయియందు మేళవించి బ్రహ్మానందరసానుభూతిని ప్రసాదించినవాడు గాయకవరే ణ్యుడు త్యాగయ్య.

ఆయా రాగముల జీవకళ లుట్టిపడునట్లు గంభీరభావ పూరితములైన కృతులను రచించి సంగీత రచనకు ఆంధ్రి భాషయే సరియైన దని చాటించిన వాగ్గేయకారుడు త్యాగయ్య. వేదవేదాంగములలోని అమూల్యోపదేశము లనేగాక తదితర మతసారములను విశేషించి చక్కని తెనుగు నుడికారమున ప్రజానీకమున కందిచ్చిన మహనీయుడు త్యాగయ్య.

నైగమనిష్ఠయందు వ్యాసునిగను, కవితాగోష్ఠిని వాల్మీ కిగను, వైరాగ్యమున శుకసంయమీంద్రునిగను, భక్తియందు ప్రహ్లాదునిగను, సాహిత్యమున చతుర్ముఖునిగను, గానమున నారదునిగను పరిగణింపబడిన సర్వజ్ఞమూర్తి త్యాగరాజు. నిఖిలవేదోపనిషత్సారం బగు మహోత్కృష్టోపదేశమును ఇరువదినాలుగువేల దివ్యసంకీర్తనములచే వ్యక్తము చేసిన సంగీత జగద్గురువు శ్రీత్యాగరాజు.

నాదవిద్యా మర్మముల నెల్ల లక్ష్యలక్షణసమన్వయ మొనరింపగల వాగ్గేయములను రచించి గానమును సర్వాంగ స్ఫూర్తి గావించి దక్షిణభారతావనిలో మోక్షసాధనో

పాయమును, ముక్తిని ప్రసాదించిన విశ్వదాత త్యాగయ్య. ఇదిగాక యితర రాష్ట్రీయులకు గూడ "దేశభాషలందు తెలుగులెస్స" యన్న వాక్యరమణీయతను సిద్ధాంతపూర్వకముగ సుప్రతిష్ఠితము జేసిన మహనీయుడు త్యాగయ్య. "స్వయముత్తీర్ణః పరాన్తారయతి" అన్నట్లు నిశ్చలభక్తితో 96 కోట్ల రామనామమును జపించి, ఈశ్వరానుగ్రహమును బొంది, తరించి తరింపజేసిన త్యాగమూర్తి త్యాగయ్య.

ఇతని కృతు లన్నీ నాదబ్రహ్మసాక్షాత్కారానుభూతిలో నుండి యావిర్భవించిన దివ్యమూర్తులు. ఒక్కొక్క కీర్తన ఒక్కొక్క రాగసుధారసము కరుడుగట్టి నమలి మ్రింగినకొద్దీ అపారముగ చవులూరించి రాగసుధారసపానమత్తను కల్గజేసే అమృతగుళిక.

"Tyagaraja's songs breathe the wisdom of Socrates, the tenderness and nathos of Buddha, the love of Christ for suffering humanity, the quintessence of Upanishads and with all an ineffable sweetness of music for which there is no parallel in the ancient or the modern world" ఇట్టి దివ్యామృతములొల్కు వేనకువేలు కీర్తనలను రచించి దాక్షిణాత్యగాయకులకు భక్తిమార్గమును జూపిన నాదబ్రహ్మ సద్గురుమూర్తి త్యాగబ్రహ్మం. భగవద్గుణానుభవమును విస్పష్టమొనర్చుచూ మోక్ష సామ్రాజ్య ధర్మ హార్మ్య సంప్రాప్తికి సన్మార్గ సోపానములై సుజ్ఞానోపదేశకరములై, యొప్పి నైతిక ధార్మిక పారమార్థిక

విద్యాదుల యెడ నప్పుడప్పుడు సాంకర్యముచే పతనస్థితి సంభవించినపుడు దానిని తొలగించి సుస్థితిని ప్రతిష్ఠించి ధర్మోద్ధార మొనర్చుటకు లోకసంగ్రహార్థ మీశ్వరాంశ సంభూత మహాపురుషు లవతరించుచుందురు. దీనికి దృష్టాంత ముగ శ్రీ శంకర రామానుజ వల్లభాచార్య మతప్రవక్తల యొక్కయు శ్రీ జయదేవ నారాయణతీర్థ అన్నమాచార్య త్యాగరాయ ప్రముఖ భక్తశిఖామణుల యొక్కయూ పరమ పవిత్రజీవితములే నిదర్శనములు. వారి ప్రవర్తనము లవశ్యాను సరణీయములు. వారి దివ్యచరిత్రము లనవరతపఠనీయములు. వారి పావననామములు చిరస్మరణీయములు.

వంశావళి:— తంజావూరు సమీపమున శ్రీ త్యాగరాజ స్వామి ఆలయముచే నలంకృతమగు తిరువారూరు పుణ్య క్షేత్రమున నివసించుచున్న ఆంధ్ర ములికినాటిబ్రాహ్మణులు, కాకర్లవంశీకులు, వేదశాస్త్రపురాణవేత్తలు నైన పంచనద బ్రహ్మమునకు సదాశివ, సదానంద, సచ్చిదానంద, బాలా నంద, గిరిరాజ ప్రముఖు లయిదుగురు పుత్రు లుద్భవించిరి. వారిలో గిరిరాజకవిని సుబ్రహ్మణ్యభారతి యనిబిల్చుచుండిరి. ఇత డాంధ్రగీర్వాణభాషాకోవిదుడు, గానవిద్యాసంపన్నుడు. వేదాంతపరమైన గేయములను పెక్కింటిని వ్రాసెను. మహా రాష్ట్ర ప్రభువులగు శహాజీ, శంభాజీగార్లను నాయకులుగా జేసి ఇతడు 100 సంగీతపదములు రచించెను. అవి యిప్పుడు లభ్యముకావు. కొన్ని యక్షగానములుకూడా వ్రాసెనట.

గిరిరాజుకొడుకునూ త్యాగయ్యతండ్రియు నగు రామబ్రహ్మము, భారతరామాయణేత్యాది కథాప్రసంగములో దక్షుడు. తుల జాజీ మహారాజాస్థానములో శ్రీమద్రామాయణ ప్రవచనము జేసి, శ్రీరామనవమిమహోత్సవమును సలిపి అనేక సన్మానము లను పొందెను. త్యాగరాజు తాతతండ్రులు సంగీత సాహిత్య గోష్ఠిలో కాలమును గడపుటచే అతని కుక్షుపాలతో భగవ ద్భక్తి గానాభిరుచులు సంక్రమించెను. ఇతని సోదరులగు పంచనదం, పంచాపకేశనులకు విద్యాగంధమబ్బలేదు. పైగా వీరు దుష్ప్రవర్తకులగుటచే తలిదండ్రులు కాశీయాత్రార్థమై పోవ సమగట్టిరి.

నారద, వాల్మీకి, సరస్వతీ, భారద్వాజాంశసంభూతు డగుపుత్రుడు కలుగుననియు, అతనిని త్యాగరాజని పిలువవలసిన దనియు రామబ్రహ్మమునకు స్వప్నమువచ్చెను. రామబ్రహ్మం భార్యాసమేతుడై త్యాగరాజాలయమునకు బోయి పూజ అభిషేకాదులను నిర్వర్తించి స్వప్నఫలమున కెదురుచూచు చుండెను. స్వప్నఫలము ననుసరించి త్యాగయ్య అయిదవ నాడు జన్మించెను. ఇతని జన్మ సంవత్సరం 1759 (బహు ధాన్య సం॥రం వైశాఖ శుద్ధ షష్ఠీ సోమవారం). పిమ్మట రామబ్రహ్మం పుత్రసమేతముగా కాశీకి పోవుచూ మార్గ మధ్యమున పంచనదములో విడిసిరి. ఆనాటి రాత్రి పంచన దేశ్వరుడు స్వప్నసాక్షాత్కార మిచ్చి, తిరువయ్యారు కాశీ క్షేత్రముకంటె గొప్పదనియు, అచ్చట సిద్ధిపొందినవారు

లింగస్వరూపులగుదురనియు చెప్పి అంతర్హితు డయ్యెను. ఈ వార్తను తులజాజీ విని వారికి తిరుమంజన వీధిలో ఒక గృహమున్నూ, ఒక వేలి భూమిని యిచ్చిరి. నాటినుండి వారచ్చటనే నివసించుచూ, త్యాగరాజున కయిదవయేట నుపనయన సంస్కారమును, గీర్వాణ భాషాభ్యాసమును జేయించి, సూత్ర సహితముగా రామమంత్రోపదేశమును జేసిరి.

బాల్యచాపల్యమున త్యాగరాజు సవయస్కులంగూడి గోలిగుండ్లాడుచు కలవరించుచుండెను. అంతట రామకృష్ణా నంద యతి యితని మనసును ఆటలనుండి మరలించి రామ షడక్షరీ మంత్రము నంగన్యాస కరన్యాస పూర్వకముగా నుపదేశించి మంత్రదీక్షనొసంగెను. నాటినుండి త్యాగయ్య శ్రీరాముని భక్తి శ్రద్ధలతో పూజించి, జపించుచున్నపు డితనికి శ్రీరామునిపైని కీర్తనలను రచించి బాడవలె నను యిచ్ఛ బొడమెను. వెంటనే తోడిరాగములో "నమో రాఘవాయ" అను కృతిని రచించి పాడుచుండగా, తండ్రి విని అచ్చట సంగీతవిద్వాంసులకు వినిపింపగా వారా కీర్తన లోని మధురభావములను భక్తితత్పరతను విని ముగ్ధులై అతని కీర్తనలను జాగ్రత్త పరుపవలసినదని సలహాయిచ్చిరి. ఇతడు చిన్ననాటనే వేదాధ్యయనమును సాంగోపాంగముగ చేయు టయేకాక, శొంఠి రమణయ్యవద్ద గానవిద్య నభ్యసించి అసమానపాండిత్యమును సంపాదించెను. ఇట్లు శ్రీరాముని

అనంతకల్యాణగుణములను 24 వేల కృతులలో గానము చేసి "గిరిరాజసుతా" యను విఘ్నేశ్వర ప్రార్థనముతో ప్రారంభించెను. అనవరతమును శ్రీరామపదరాజీవధ్యానము చేసి తన్మయత్వముచే వెల్వడెడి దివ్యనామకీర్తనములను కర్ణ రసాయనముగ పాడుచూ శ్రీరామసేవలో నిమగ్నుడై యుండెను. ఇతని తలిదండ్రుల పేర్లు సీతమ్మ రామబ్రహ్మ మగుటచే "సీతమ్మ మాతల్లి శ్రీరాముడు మాకు తండ్రి" అను ద్వంద్వార్థ మిచ్చే కృతిని రచించెను. ఆ రోజులలో కాగిత ములు లేకపోవుటచే బొగ్గుతో తనకీర్తనలను గోడపైని వ్రాసెడి వాడట. వీనిని యితని తండ్రి వదిలపరచెను. ఈ కీర్తనలు తంజావూరు, తిరువయ్యారు గ్రామములో బాగా వ్యాప్తి జెందినవి.

ఆనాడు తంజావూరు రాజదర్బారులో 360 మంది మహాగాయకు లుండిరి. వీరందరికీ వారి యదృష్టానుసారము సంవత్సరమున కొకసారి వకరోజు మాత్రము లభించెడిదట. ఈకారణముచే ప్రతిగాయకుడు గాయకపోటీలో నిలబడుటకు ఒక్కొక్క రాగములో విశిష్టతను సంపాదించుటకు తీవ్రకృషిని సల్పెడివారట. అట్టి గాయకులలో ముఖ్యులు శంకరాభరణం నర్సయ్య, అఠాణా అప్పయ్య, తోడి సీతారామయ్యగార్లు. ఈమహామహుల మధ్యను క్రొత్తవిద్వాంసు డని పేరుపొందు టయే త్యాగయ్య అలౌకికప్రతిభను చాటుచున్నది. ఇతని కీర్తి దేశదేశాంతరములలో వ్యాపించుటచే, ఒకనాడు

శొంఠి వేంకటరమణయ్య తిరువారూరి గాయక సమావేశము జేసి వారి సమక్షమున త్యాగయ్యచే పాడించి 'శెబాస్' అనిపించెను. పండితసభలో త్యాగయ్య "ద్వారకునా యిటువంటి సేవ" అను కీర్తనను అద్భుతముగా బాడి శ్రోతలను చకితుల జేసెను. ఒకనాడు వెంకటరమణయ్య తనశిష్యుని అపారపాండిత్యమును విని ఉప్పొంగి తన తండ్రియగు వెంకటసుబ్బయ్య (ఆస్థానఘనవిద్వాంసుడు) తదితర ఆస్థానగాయకుల యెదుటను పాడమని త్యాగయ్యను ప్రేరేపించగా అతడు కాంభోజి రాగములో "మరిమరి మొరలిడినానే" అను కీర్తన నద్భుతముగా పాడి శ్రోతలను పరవశులను గావించెను. ఈవార్త శరభోజిమహారాజు చెవులసోకినంతనే త్యాగయ్య గానమును వినవలెనను కుతూహలముతో కబురంపగా నిరాడంబరుడును నిర్లిప్తుడునగు త్యాగయ్య "నిధి చాలసుఖమా రామునిసన్నిధి చాలసుఖమా" అను కృతిని రచించి దర్బారునకు బోవ నిరాకరించెను. తనయాజ్ఞను ధిక్కరించినందులకు త్యాగయ్యను బంధించి తెమ్మని భటుల కాజ్ఞాపింపగా శరభోజీకి దుర్భరమైన కుక్షిశూలవచ్చెను. రాజును సంతుష్టపరచి అమూల్యమైన నిధినిక్షేపముల నార్జించు తరుణమును బోగొట్టుకొన్న సోదరుని జూచి జపేశుడు కుపితుడై "నీ భజన బట్టకాయెనా? పొట్టకాయెనా?" అని నిందించెనట.

త్యాగరాజునకు గురుముఖముగా నేర్వని విద్య వ్యర్థమని తోచగా "గురువులేక యెటువంటి గుణికి తెలియగ

బోదు" అని రచించెను. ఇతని మాతామహుడగు వీణ కాళహస్తయ్య పరమపదించిన పిమ్మట 'నారదీయ'మను గ్రంథము లభింపగా ఇతనికి ఆ గ్రంథ మవగతముకాలేదు. ఈసందర్భమున ఈశ్వరానుగ్రహముచే రామానందయతి నారదోపాస్తి మంత్రము నుపదేశింపగా నారదఋషి దర్శన మిచ్చి పంచనదీశ్వరాలయమునకు గొంపోయి స్వరార్ణవమను గ్రంథము నిచ్చి సకలశాస్త్రముల యర్థము అవగతమ్మగు నని చెప్పి అంతర్ధానమయ్యెను. ఈ ఘటనయొక్క సత్యమీదిగువ శ్లోకముచే ధృవపడినది.

శ్లో॥ ఆత్మమధ్యగతః ప్రాణః ప్రాణమధ్యగతో ధ్వనిః |
ధ్వని మధ్యగతో నాదః నాదమధ్యే సదాశివః॥

ఈశ్లోకభావము ననుసరించి త్యాగయ్య 'రాగసుధారస పానము' అనుకృతిని రచించెను. ఇంతేకాక స్వరార్ణవము లోని వివిధమూర్ఛనలకు నేడు ప్రచారములోనున్న పేర్లకు వేరుపేర్లుండెనని స్పష్టమగుచున్నది. ఇతడు నారదాంకితముగా "శ్రీనారదనాదసరసీరుహభృంగ" "నారదగురుగుహ" "నారద గురుస్వామి" మున్నగు కీర్తనలను రచించెను. నారదుడు తన మాయారూపము బయల్వడెనని తెలిసికొని త్యాగయ్యకు రామతారకమంత్రము నుపదేశింపగా త్యాగయ్య "ఎంత భాగ్యమో", "సందేహమును దీర్పుమయ్య" అను కృతులను రచించెను.

ఇతడు రామకోటిని జపించి పూర్తిగాక ఒకనాటి యుదయమున స్నానసంధ్యాదికముల నిర్వర్తించి పట్టాభిషేక సమయమున శ్రీరాముడు ప్రత్యక్షముగాకపోవుటచే "ఏల నీ దయరాదు" అను కృతిని రచించెను. రెండుసార్లు రామ కోటి జపమును పూర్తిచేయగా శ్రీరాముడు సపరివారముగా దర్శనమిచ్చుటను గాంచి, "కనుగొంటిని శ్రీరాముని", "ఎంతముద్దు ఎంతసొగసు" "నాదసుధారసంబిలను నరాకృతి ఆయెరా" అను కృతులను బాడెను. గురువుగారి కీవిషయములు తెలియగా త్యాగరాజుచే పాడించిరి. త్యాగయ్య "దొరుకునా యిటువంటి సేవ" యను కృతిలోని చరణములో "కామిత ఫలనాయకి యగు సీత" అన్నచోటను సాహిత్యస్వరములు వేయగా గురువుగారు తమకు రాజావారిచే బహూకరింపబడిన "మకరకంఠి" మున్నగు ఆభరణముల నితనికొసంగి దీర్ఘాయు డవుగమ్మని ఆశీర్వదించిరి. త్యాగయ్య "జయ జానకీరమణ" అను కృతిని బాడి ఆశీర్వచనమును స్వీకరించెను. కాని గురువులవారి పుత్రికావివాహసందర్భమున తిరిగి మకరకంఠిని నూత్నవస్త్రాదులతో కానుకగా సమర్పించెను.

ఐహిక భోగ లాలసుడైన జపేశునకును త్యాగయ్య కును పొత్తుకుదరకపోవుటచే పిత్రార్జిత ఆస్తిని వీరు పంచుకొనగా త్యాగయ్యనాటాకు రామపంచాయతన విగ్రహములు వచ్చెను. త్యాగరాజు ఆనందముతో యీ విగ్రహముల నలంకరించి "కొలువైయున్నాడే" "కొలువమరెగదా" యను

కీర్తనలను రచించి పాడుచూ కాలమును గడపుచుండెను. ప్రతి సంవత్సరము సమారాధనలుచేసి సంగీతరసికులకు తన కీర్తనలను వినిపించుటను గాంచి ఈర్ష్యాగ్రస్తుడైన జపేశుడు రామ పంచాయతన విగ్రహములను దొంగిలించి కావేరీనదిలో బాఱవైచెను. ఈ సంఘటనకు త్యాగయ్య చింతాగ్రస్తుడై "ఎందుదాగినాడో" మున్నగు కృతులను రచించి నిద్రాహారముల నొల్లక ప్రలాపించుచుండగా నొకనాటి రేయి స్వప్నములో శ్రీరాములవారు తానున్న చోటును జూపెను. వెంటనే అచ్చోటికిపోయి విగ్రహములను వెదుకగా అవి ప్రత్యక్షమగుటచే పట్టలేని సంతోషముతో "రారా మాయింటిదాక" అను కీర్తనను బాడి విగ్రహసంప్రోక్షణమును జేసి అన్నగారికి సద్బుద్ధినొసంగుమని దేవుని ప్రార్థించెను. ఒక రోజున తనభార్య పార్వతి ధర్మసంవర్ధనీదేవితో సంభాషించుటనుగాంచి వెంటనే త్రిపురసుందరిపైని "దారిని తెలుసుకొంటి" అను కృతిని రచించెను. కొంతకాలమునకు భార్య మరణించగా ఆమె సుగుణములను దలంచుచూ "తొలిజన్మమున జేయు", "ఏపాపము జేసితినో" అను కృతులను రచించెను. ఆమె చెల్లెలు కమలను ద్వితీయకళత్రముగా తీసుకొని సీతమ్మయను పుత్రికను బడసెను.

**త్యాగయ్య తీర్థయాత్ర:—** ఇతడు దక్షిణాదిని గల సుప్రసిద్ధ శైవ, వైష్ణవక్షేత్రములన్నింటిని దర్శించి ఆయా దేవుళ్లపైని కృతులను వ్రాసెను. ఇతడు కోవూరు, శ్రీరంగం,

మద్రాసు, తిరుపతి, కంచి, పుదుక్కోట క్షేత్రములను దర్శించెను. తిరుపతి శ్రీవేంకటేశ్వరులవారి దర్శనాభిలాషను కాంక్షించి "తెరతీయగరాదా", కోవూరు సుందరేశ్వరునిపైని "శంభో మహాదేవ" అనుకృతుల రచించెను. కోవూరు సుందరేశ మొదల్యారు త్యాగయ్యనిర్లిప్తస్వభావమును తెలుసుకొని రహస్యముగా పల్లకీలో వరహాలమూట నుంచెను. కొంతసేపటికి పల్లకీ అరణ్యములగుండా బోవుచుండగా దొంగలు బలాత్కరించిరి. అంతట త్యాగయ్య తనయిష్టదేవతాప్రార్థన చేయగా ధనుష్పాణులైన రామలక్ష్మణులు లాదొంగలను భయపెట్టిరి. త్యాగయ్య అంతట "ఎవరిచ్చిరిరా యీ శరచాపం" అనుకృతినిబాడగా దొంగలుతామే ఆపల్లకిని మోసి సురక్షితముగా ఒకఅగ్రహారమును చేర్చిరి.

ఆవూరిలో కాశీయాత్రార్థమై పోవుచున్న దంపతులు వ్యాఘ్రబాధకుభయపడి అక్కడనున్న పాడుదేవాలయములో ప్రాణరక్షణమునకు ప్రయత్నించగా పురుషుడు పాడునూతిలో పడి మరణించెను. ఈవార్తనుత్యాగయ్యవిని 'నాజీవనాధారా' కృతిని రచించి అతనిపునర్జీవునిగజేసెను. కంచిలో ఉపనిషద్ బ్రహ్మం ఆహ్వానముపైని పోయి కామాక్షిపైని కృతులను వ్రాసెను. మద్రాసు, పార్థసారథిదేవాలయములో దేవగాంధారిరాగమును వరుసగా వారంరోజులు పాడెను. పుదుక్కోట మహారాజుదర్బారులో జ్యోతిస్వరూపిణి రాగమును పాడి దీపమును వెలిగించెనట. ఇతని జీవితంలో ఇట్లెన్నేని

అద్భుతఘటనలు గలవు. తీర్థయాత్రలను ముగించి త్యాగయ్య స్వక్షేత్రమగు పంచనదమును చేరగా అచ్చట తనదర్శనముకై వేచియున్న గోవింద మరా రను తిరువాన్‌కూరు విద్వాంసుని గాంచెను. గోవిందమరార్ యొక్క గానప్రతిభకు మెచ్చి అతనికి గోవిందదాసు అను బిరుదమునిచ్చి "ఎందరో మహాను భావులు" అనుకృతిని రచించెను. ఈవిధముగా త్యాగయ్య కృతులనే గాక ప్రహ్లాదవిజయం, నౌకాచరిత్ర మున్నగు యక్షగానములను కూడ రచించెను.

ఇట్లు త్యాగయ్య 88 ఏండ్లుజీవితమునుగడిపి "జ్ఞాన మొసగ రాదా" "ఇదిసమయమురా" "దయజూచుటకిది వేళరా" అనెడి కీర్తనాదులచే తనకు మోక్ష మొసంగుమని దీనభావముతో శ్రీరాముని ప్రార్థించెను.

ఒకఏకాదశినాటి రేయి తనకుత్వరలో భగవత్సందేశము రానున్నదని కలగనెను. ఆకలలో "నీవు సన్యాసమును స్వీక రింపుము. నేటికి అయిదవదినమున నా పదవిని నీకొసంగె దను"అనిచెప్పి రాము డంతర్ధానముజెందెను. అంతట త్యాగ రాజు "గిరిపై నెలకొన్న రాముని" అను కడపటి కీర్తనమును బాడి ఆనందముతో ఆనాడే వేదవేద్యులను, పరమభాగవ తోత్తములను రావించి వారిమ్రోలను బ్రహ్మానందతీర్థులవారివద్ద సన్యాసాశ్రమమును తీసుకొనెను. భగవదాదేశానుసారము 1847 సంవత్సరములో పుష్య బహుళ పంచమీ తిథిని భౌతిక శరీరమును వీడి స్వర్గధామమును జేరెను. ఆయన కపాలమును

చీల్చి ఒకదివ్యజ్యోతి అంతరిక్షమున కెగసెను. గానగంధర్వు డగు త్యాగయ్య వెంటను శిష్యులు రామభజనముసేయుచూ కావేరీతీరమున వారి భౌతికశరీరమున కభిషేకము లొనర్చి బృందావనమును గట్టిరి.

## త్యాగరాజ శిష్యపరంపర

మహాభక్తుడును వాగ్గేయకారుడునైన త్యాగయ్య ప్రతిభను ఉదారస్వభావమును విని అనేకు లితనికి సంగీత శుశ్రూషను జేసిరి. అన్నింటికంటెను అతీతమైన విషయ మేమనగా శివకేశవభేదములులేక సర్వమతసహిష్ణుతను గాంచుటచే భక్తులు సంసారులు విరాగులు అన్నివర్ణములవారు, వర్గములవారు యితనిని భక్తితో సేవించుచుండిరి. ఆకాలము నాటి దంభభక్తుల కుచేష్టలను నిర్భయముగ ఖండించుచూ అనేకులను సన్మార్గగాములను జేసిన ట్లితని కృతులు చెప్పు చున్నవి. ఇతనికి పండితపామర భేదము మిత్రత్వ శత్రుత్వ విచక్షణమును లేదు. అందుచే యితనిబోధనలు సర్వజనాంగీ కారము లయ్యెను. ఇతనిని విమర్శింప బూనిన వేదాంతులు సైత మితని ముఖావలోకనము చేసినంతనే జంకుచుండిరి. దీనికి కారణ మితని పరిశుద్ధత ఆత్మస్వాతంత్ర్య మనోనిశ్చయాదులు.

దక్షిణభారతములో నితని యశశ్చంద్రికలు ధవళ కాంతులతో మెరసెను. కాశీవంటి విద్యాసంపన్న క్షేత్రము

నుండి గోపీనాథ భట్టాచారి యితనికీర్తనలనువిని దర్శించుటకు తిరువయ్యారు వచ్చెను. పట్నాలగోవిందమరారను ప్రతిభావంత గాయకు డితనిని సందర్శించి ధన్యుడయ్యెను. ఇత డపర నారదు డని ప్రజలు భూషించుచుండిరి. ఇతని కీర్తనలలోని అర్థగాంభీర్యమును, భాషాపాండిత్యమును, కవితామాధుర్యమును గ్రోలలేని తమిళులు కూడా యితని కృతులను పాఠముజేసికొనుచున్నారు. ఆంధ్రభాషామాధుర్య కవితాపాటవములను చవిజూచిన మహావైద్యనాథయ్యరు, పట్నం సుబ్రహ్మణ్యం, పూచయ్యంగారు, శామశాస్త్రి మున్నగు గాయకవరేణ్యులు తెనుగుకీర్తనలను రచించి ప్రఖ్యాతిని గాంచిరి. ఆంధ్రభాష నభ్యసించి అనేకులు యితనికీర్తనలను పాడియు, ఇతనిపైని ప్రశంసాపూరిత గేయముల నల్లియు తరించినారు.

మరికొందరు త్యాగయ్యపైని తమకుగల భక్తి ప్రేమలను వెల్లడించుటకు తమబిడ్డలకు అతనిపేరును బెట్టిరి. ప్రతి ఏటను ప్రఖ్యాతగాయకులంతా తిరువయ్యారులో సమావేశమై పుష్య బహుళ పంచమినాడు త్యాగరాయవర్ధంతి నత్యంత వైభవముగా జరుపుచున్నారు.

శిష్యవర్గ ప్రముఖులు: వీణకుప్పయ్య, వాలాజిపేట వెంకటరమణభాగవతార్, అయ్యాభాగవతార్, గణేశయ్య, సుబ్రామభాగవతర్, సోజిరి సీతారామన్, తిల్లస్థానం రామయ్యంగారు, నేమం సుబ్బరామయ్య, ఉమయాల్పురం కృష్ణ

భాగవతర్, సుందర భాగవతార్, శివరామయ్య, నాగ వరం నీలకంఠన్, మానంబుచావడి వెంకటసుబ్బయ్య, కన్నయ్య భాగవతార్, అమృతలింగంపిళ్ళె మొదలగు వారును, కొందరు భరతనాట్య హరికథాప్రవీణులును జీవనో పాధికి ఉంఛవృత్తి నవలంబించిరి. వీరుగాక గోవిందశివన్, ముత్వాలూరి సభాపతి, నెయ్యకార్పట్టి సుబ్బయ్య, తంజా వూర్ రామారావు, లాల్గుడి రామయ్యగార్లు శిష్యులుగలరు.

వీణ కుప్పయ్య: ఇతడు సామవేద బ్రాహ్మణుడు. భారద్వాజ గోత్రికుడు. ఇతడు నారాయణగౌళ రాగ ప్రవీణు డగుటచే "నారాయణగౌళ" కుప్పయ్య అను వ్యవహార నామ ముండెను. వీణ, ఫిడేలు వాద్యములో చతురుడు. గానచక్ర వర్తిబి రుదాంకితుడు.

ఇత డనేక ఆదితాళ వర్ణములు, కీర్తనలు, తిల్లానాలు రచించి వేణుగోపాలముద్రను తగిల్చెను. ఆంధ్రగీర్వాణ భాషాకోవిదుడును, గానరహస్యవేదియు నగుటచే నితనిపైని త్యాగయ్యకు మక్కువఎక్కువ. స్వతంత్రగాయకు డగుటచే అనేకుల కితడు మార్గదర్శి. ఇతడు కోవూరి సుందరేశ మొదలి ఆస్థానగాయకుడుగ నుండెను. వినాయకచతుర్థి చిత్రిపూర్ణిమ పండుగలను వేడుకతో నిర్వర్తించి ఘనవిద్వాంసుల కచేరీ లేర్పాటు గావించెను. గొప్పభక్తు డగుటచే "రాధారుక్మిణీ సమేత (శ్రీ) వేణుగోపాలస్వామి" వారి పూజాదికములను భక్తితో నిర్వర్తించెను. త్యాగయ్యగారిని కోవూ రాహ్వా

నించి త్రిపురసుందరీ సుందరేశ్వరులపై కృతులను రచింప జేసెను. వృద్ధాప్యములో యితడు మదరాసులో నివసించెను. ఇతనిశిష్యులలో ముఖ్యులు కొత్తవాసాల్ వెంకట్రామయ్య, పల్లవి సీతారామయ్య, ఫిడేలు పొన్నుస్వామి. కృష్ణస్వామి, రామస్వామి, త్యాగయ్య అను ముగ్గురు కొమరులునూ అంతా గానప్రవీణులే. ఇతని కనిష్ఠపుత్రుడైన త్యాగయ్య పల్లవిస్వరకల్పవల్లి, సంకీర్తనరత్నావళి గ్రంథముల నచ్చొత్తించెను. ఇతనితండ్రి సాంబయ్య గొప్పవైణికుడు. "సాంబడు వాయించవలె, సాంబడు (శివుడు) విని ఆనందించవలె" నను సామెత స్థిరముగ నిలిచి పోయినది. ఇతనిమూలమున సంగీతనిలయమన్న ఖ్యాతి మదరాసునకు వచ్చెను.

వాలాజాపేట వెంకటరమణయ్య:— మధురనివాసి, సౌరాష్ట్ర బ్రాహ్మణుడు. త్యాగయ్య పైని ధ్యానశ్లోక మంగళాష్టకములను రచించెను. గురుపుత్రిక సీతమ్మ వివాహ సందర్భంలో కోదండరాములవారి తైలచిత్రమును వ్రాసి బహూకరించెను. త్యాగరాజు భావోద్రేకముతో "నను పాలింప" అనుకీర్తన నాశువుగ చెప్పెను. ఈ చిత్రమిప్పటికినీ త్యాగయ్య వంశీకులవద్ద నున్నది.

ఇతని శిష్యులు: మైసూర్ సదాశివరావు, (కొడుకు) కృష్ణభాగవతార్. రమణయ్య భావసంవత్సర మార్గశిర శు॥ సప్తమినాడు నిర్యాణము నందెను.

తిరువాడి సుబ్రామయ్య:— త్యాగరాయ కృతులకు ప్రథమ స్వరరచయిత. త్యాగరాయ కృతి గానక్రమపద్ధతిని తన కొడుకునకు నేర్పించెను.

నేమం సుబ్రహ్మణ్యం:— పల్లవి ప్రవీణుడు. కృతులను పాడుటలో నేర్పరి. ఇతని కొడుకు నటేశయ్య కూడా గాయకప్రవరుడు.

ఉమయాల్పురం సోదరులు:— కృష్ణభాగవతార్, సుందరభాగవతార్లు. వీరు త్యాగయ్యగారి పనుపున ఆదుత్తురై నివాసి జగద్రక్షక భాగవతార్ వద్దను గానవిద్యను ప్రారంభించి చతురతగాంచి పిమ్మట తక్కినశిష్యుల క్రమముచొప్పున త్యాగయ్యవద్ద "జానకీ మనోహరం" కృతిని ప్రారంభించిరి.

టి. శివరామయ్య:— సుబ్రామభాగవతార్ కొడుకు. మానంబుచావడి వెంకటసుబ్బయ్య వద్దను శ్రీ త్యాగరాయ కృతులను సాంప్రదాయ సిద్ధముగా నేర్చి ఫిడేలుపైని వాయించెను. పంచాపకేశ భాగవతారుతో కలసి మైసూరు, బరోడా, కాశీపట్టణముల కేగెను. దేశీయ రాగతాళములలో చతుషష్ఠి మాలికను, నవరత్న రాగమాలను రచించెను.

మువ్వనల్లూరు గోవిందన్ సభాపతి సోదరులు:— నివాసం శాలీయమంగళం. మధ్యార్జునం దొరస్వామి కొమాళ్ళు. పదకర్తలు. సంస్కృతములో కృతులు రచించిరి.

మానంబుచావడి వెంకటసుబ్బయ్య:— ములికినాటి తెనుగు బ్రాహ్మణుడు. త్యాగయ్యగారి బంధువు. మంచి ఫిడేలు వాద్యగాడు. వేంకటేశముద్రతో అనేక కృతులను రచించెను. "స్వామికి సరియెవరు?" అను దేవగాంధారి కృతిలో గురుభక్తిని వర్ణించెను.

శిష్యవర్గం.— మహా వైద్యనాథయ్యర్, పట్నం సుబ్రహ్మణ్యాం, శరభశాస్త్రి, ఫిడేలు వెంకోబారావు, పంచాపకేశన్, శివరామయ్య, సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రి (బందరు)

తంజావూరు రామారావు:— జననం 1757. త్యాగరాజులవారి శిష్యుడును కార్యదర్శియు, వారితో కలసి ఉత్తరాది తీర్థయాత్రలు చేయుచూ తిరుపతి, వాలాజీపేట, షోలింఘర్, చెన్నపురి, తిరువత్తూరు, కోవూరు, కంచి మున్నగు నగరములను చూచెను. శిష్యులంతా వీరిని చిన్న త్యాగయ్య అని సంబోధించేవారు. భారమైన పనులను నిర్వర్తించుటకు త్యాగయ్య వెంకట్రామభాగవతార్‌కు పురమాయించుచు, రామారావును "అయ్యర్‌వాళ్" అని పిలిచెడివారు.

సుబ్బరాయశాస్త్రి (1803 - 62): ఇతడు శ్యామాశాస్త్రియొక్క ద్వితీయపుత్రుడు. గానవిద్యప్రారంభశదను తండ్రివద్దముగించి, త్యాగరాజువద్ద పూర్తిచేసెను. ఆంధ్ర గీర్వాణ ద్రవిడ భాషాకోవిదుడు. కుమారముద్రలో పెక్కు

కృతులను, స్వరజతులను రచించెను. మధ్యమకాల స్వర సాహిత్య చిట్టస్వరములతో కూడిన యితని కృతులను త్యాగరాజు విని మెచ్చుకొనెను. ఫిడేలువాయిద్య మితనికి కరతలామలకము. ఉదయార్పాళెం రాజితని కోరికల విషయమై ప్రశ్నింపగా తనపైని "అంబకటాక్షమున్న దంతియుచాలు" నని వాక్రుచ్చెను. 1862 సం॥రం లో చైత్రమాస కృష్ణదశమినాడుదయం సంధ్యవార్చి 'దత్తం' అనుచూ నీరువదలి రెండు గంటలసేపు తన కాయుఃప్రమాణమున్నదని తెలిపెను. ఆవిధముగానే అతడు మరణించెను. ఇతనిశిష్యులు అన్నాస్వామి, తాళపారంగత కంచి కాశీశాస్త్రి, ఫిడేలు చంద్రగిరి రంగాచార్లు, గీతాల శోభనాద్రి, పొన్నుస్వామి, బాలు, తిరుజ్ఞాన ముదలి, చిన్మఠం రాఘవులుచెట్టి.

కన్నయ్యభాగవతార్: త్యాగరాజకృతులను స్వాతి తిరునాళ్ దర్బారులో పాడి ప్రచారముచేసెను.

ముత్యాల్పేట త్యాగయ్య: వీణ కుప్పయ్య కొడుకు. తండ్రివద్దను గానమభ్యసించి తండ్రిపేరట పల్లవిస్వరకల్పవల్లి సంగీతరత్నావళి గ్రంథములచ్చొత్తించెను. ఇతడు నూట ఎనిమిది కీర్తనలు, వర్ణములు, రాగమాలికలు రచించెను. ఇతని యిల్లే గాయకులకు యాత్రాస్థలమయ్యెను. శిష్యులు: నారుమంచి సీతారామయ్య, పిరాట్ల శంకరయ్య, దుడ్డు సీతారామయ్య, సుబ్రాయశాస్త్రి. 1917 సంవత్సరములో మరణించెను.

ఝంఝామారుతం సుబ్బయ్య:— తంజావూర్ కన్నయ్య శిష్యుడు అగు వడ్డి సుబ్బయ్య స్వాధ్యాయి. ఇతనిది త్రిస్థాయిగాత్రం. మైసూర్ మహారాజా వారిచే "ఝంఝామారుతం" బిరుదమును బొందెను.

మైసూర్ సదాశివరావు:— వాలాజాబాద్ వెంక టాద్రియప్ప శిష్యుడు. సర్వతోముఖ పాండిత్యమును సంపా దించి కృతులు, తిల్లానాలు, స్వరజతులు, తానవర్ణాలు, పదవర్ణాలు వ్రాసెను. మర్యాదస్థుడు, సల్లక్షణశోభితుడు, మధురమైన గాత్రిము గలవాడు నగుటచే మైసూర్ రాజా ముమ్మడికృష్ణరాయ లితనికి ఆశ్రయమిచ్చెను. ఇతడు గొప్ప నారసింహోపాసకుడు.

ఒకనాటి సాయంకాలం ఇతడు కమలామనోహరి రాగములో రచించిన "నరసింహు డుదయించె" నను కృతిని పాడమని యితని స్నేహితులు నిర్బంధించిరి. ఈ కృతి నీతడు పవిత్రముగా పాడునట్టి యలవాటు గలవాడగుటచే పాడుట కొప్పుకొనలేదు. కాని వారి అనురోధమును తప్పించుకొనలేక పాడదొడంగెను. చరణములోని "సరసిజానందము పగుల" అను వాక్యమును ముగించునప్పటికి నరసింహుని ఫోటోకు అమర్చిన గ్లాసుపగిలి భూమిపైని బడి చూపరులకు దిగ్భ్రాంతిని గొలిపెను. దీపము లారిపోయెను. వెంటనే పాట నాపి వేసి సదాశివయ్య ఆరతి నిచ్చెను. ఇతడనేక తీర్థయాత్రలను చేసి అక్కడ దేవుళ్లపై ననేక కీర్తనలను భైరవి, తోడి,

మోహన, హరికాంభోజి, బలహంస, అఠాణా రాగము లలో వ్రాసెను. మరియు గజానన, ఆంజనేయులు, త్యాగ రాజులపైని వాసెను. తన ప్రభువుపైని పదవర్ణనలు, తిల్లా నాలు రచించెను. ఈ కీర్తన లితని స్వర, తాళజ్ఞానములను వ్యక్తపరుచుచూ, రాగభావ అర్థపుష్టి గణ యతిప్రాసలతో నుతికెక్కినవి.

వాలాజీపేట కృష్ణయ్య:— అనేక కృతులను స్వర జతులను రచించెను.

అన్నాస్వామి:— 1827 జననం. ఇతడు సుబ్బరాయ శాస్త్రి దత్తుడు. కావ్యాలంకార, నాటక, వ్యాకరణ, సంగీత శాస్త్రములలోను, ఫిడేలు వాద్యములోను ప్రవీణుడు. "పాలించు కామాక్షి" "పాహి శ్రీగిరిరాజ" అను కృతులను స్వరపర్చెను. ఇతని శిష్యులే తచ్చూర్చారి సింగరాచారిసోదరులు గ్రంథకర్తలు.

తిరువారూరి పంచాపకేశన్:— త్యాగరాయల సోద రుని మనుమడును, 'మానంబుచావడి' శిష్యుడునునై సంగీత ములో అపారజ్ఞానమును గడించెను. ఇతడు 22 వ ఏటనే మరణించెను. ఇతని కొడుకు రాముడుభాగవతార్ గొప్ప గాయకుడు.

సాధు గణపతిశాస్త్రి (1893-1945): ఇతడు గొప్ప జలతరంగ వాద్యప్రవీణుడు. ఇతని తండ్రి నాగరత్నం.

నూనంబుచావడి మేనల్లుడు. రామనాడు, పిఠాపురం, ధర్మపురి, త్రిపునాండల్, స్వాధీనం జమీందార్లితని వాద్యప్రవీణతను మెచ్చి సత్కరించిరి. ఇతని సోదరుడైన సుబ్రహ్మణ్యాం మంచి గాత్రజ్ఞుడు. లార్డు సైమన్, విలింగ్డన్ ప్రభువు లితనికి యోగ్యతాపత్రములనిచ్చిరి.

ఆలగుంట సీతారామయ్య (1806-86) : తిన్నవెల్లి జిల్లాలోని ఎలవర్సనొండల్ నివాసి. గొప్ప కృతిరచయిత. ఎట్టియాపురం ఆస్థానగాయకుడు. ఇతని గాననైపుణ్యమును మెచ్చి శివాజీ భోన్సలే అనేకబిరుదములను, అశ్వములను, గజముల నిచ్చి సన్మానించెను. కాని యితడు వానిని మధుర మీనాక్షి దేవి కర్పించెను. ఎల్వరసనొండల్ రాజా యితనికి ఆదిపట్టి గ్రామమును యినాముగా నిచ్చెను. భజనపద్ధతిపైని రామమహోత్సవ ప్రాశ్తికను రచించెను.

పుదుకోట సుబ్రహ్మణ్యభాగవతార్ (1823-96): పుదుకోటరాజా తొండమాన్ రఘునాధ రామచందర్ వారి ఆస్థానవిద్వాంసుడు. తండ్రిపేరు వెంకట్రామయ్య. తిరువయ్యార్‌లో త్యాగరాజులవారిని సేవించెను. ఇతని సంగీత జ్ఞానం అపారం. ప్రహ్లాదచరిత్ర, శివానందనౌకలను గద్య పద్య కీర్తనావళులలో రచించెను. వైద్యకవీశ్వరన్ గీతముల కితడు వర్ణమెట్టులను వ్రాసెను. ఇతనికొడుకు నాగరత్నం ఆస్థానవిద్వాంసుడు. ఇతడు తిరువాన్కూరు ప్రభువుచే గౌరవింపబడెను. ఇతని నిర్యాణముతో కర్నాటకగాన మంతరించెనని రాజారామచందర్ అతిశయోక్తిగా చెప్పెను.

వైద్యకవీశ్వరన్ (1825-86): ఇతడు తొండమాన్ రాజుల దర్బారు నలంకరించెను. గొప్ప గీర్వాణ కవి, గాయకుడు. తిరుగోకర్ణపు బృహదాంబాళ్ భక్తుడు. ఇతని తెలివి తేటలను మెచ్చి రామచంద్రరాజు వరపురి యీనామును, 'కవీశ్వరన్' బిరుదమునిచ్చెను. ఇతని సంస్కృతగేయములు భక్తి సంభరితములు.

చల్లగాలి కృష్ణయ్య (1824-65): పచ్చిమిరియం ఆదెప్పయ్య శిష్యుడగు పల్లవి గోపాలయ్య కొడుకు. తంజావూర్ ఆస్థానవిద్వాంసుడు, వీణాగాత్రసంగీతములలో నిపుణుడు. శ్రుతితంతిని వాయించకుండగనే వీణనుమీటుట యితని విశిష్టత. మానవగాత్రమువలె పల్కెడిదట వీణ. దక్షిణ తెరిపి గాలివలె చల్లగానుండుటచే యితనికి 'చల్లగాలి' అని బిరుదమునచ్చెను. శిష్యులు: తిరుపెలంగాడు, త్యాగయ్య, మాయవరం వైద్యనాథన్.

స్వరకాడు వెంకటసుబ్బయ్య (1825-64): ఆరంతంగి వద్దనున్న వల్లవాడి నివాసి. శేషాచలయ్యవద్ద గానమును నేర్చి పల్లవి స్వరకల్పన జేయుటలో ప్రవీణతను సంపాదించెను. నిడమంగళగ్రామమును నివాసము జేసికొని అచ్చట బాహ్యప్రదేశమున నేకాంతముగ నాదోపాసన జేసేవాడు. ఆమరణాంతం యితనిగాత్రం గంభీరంగావుండెను. ఇతనిశిష్యుడు పల్లవి సోమభాగవతార్. తనగానమును శ్రీరాజగోపాలస్వామికి నివేదించెను. ఇతని స్వరకల్పనాచాతుర్యానికి మెచ్చి శివాజీరాజితనికి 'స్వరకాడు' అను బిరుదము నిచ్చి గౌరవించెను.

శ్రీరాజగోపాలస్వామికి నివేదించెను. ఇతని స్వరకల్పనాచాతుర్యానికి మెచ్చి శివాజీరా జితనికి 'స్వరకాడు' బిరుదాన్నిచ్చి గౌరవించెను.

కాళిదాస్ నారాయణస్వామి (1858–1926) : అభిరామయ్య కొడుకు. త్యాగరాజు వంశీకుడు. మానంబుచావడి శిష్యుడు. ఫిడేలు ప్రవీణుడు. నిడమంగళంనకు పోయి స్వరకాడు సుబ్బయ్యవద్దను గానరహస్యం పల్లవిప్రస్తరణ స్వరకూర్పు ఆదిగాగల విషయములను నేర్చెను. గైతాక్ బాంజో పియానో వాద్యలక్షణములను గ్రహించి తెల్లదొరలకు భారతీయరాగములను నేర్పెను. ఆబ్రహాం పండితర్ జరిపిన గానపరిషత్తులో పాల్గొని పెక్కువిషయములను చర్చించెను. ఇతని కొడుకుపేరు నీలకంఠన్. అతడున్ను సంగీత విద్వాంసుడే.

నీలకంఠన్ : తండ్రివద్ద గానప్రపంచములో పెంపబడెను. ఇతనియింటిలో సభా రామారావు, పూచయ్యంగారు, కోనేరి రాజపురంగార్ల గానధ్వని ప్రతిధ్వనించుచుండెను. ఏడవయేటనే స్వరజ్ఞానమును సంపాదించెను. దర్పంగలగాత్రం. అపారగానజ్ఞానం గలవాడు. రామస్వామిశివన్ రచనలు నూరింటికి అనేక రాగతాళగతులలో వర్ణమెట్లను సమకూర్చెను. 1936 సం॥రం లగాయతు 1943 వరకు కళాక్షేత్రం (అడయూర్) పండితుడుగనూ సంగీతోపాధ్యాయుల ట్రయినింగుకాలేజీ ఆచార్యుడుగను పనిచేసెను.

రామస్వామయ్య ఉరఫ్ రామానందయోగి: ఇతడు వాలాజిపేట కృష్ణస్వామి శిష్యుడు. శ్రీత్యాగయ్యగారి కృతి సంపుటమును ప్రథమున అచ్చొత్తించెను.

తిల్లస్థానంపంజు - నృశింహభాగవతార్ సోదరులు: త్యాగరాజు జీవితచరిత్రను, కీర్తనలను అచ్చువేయించిరి. నృశింహాము హరికథలను చెప్పెడివాడు.

పల్లవి శేషయ్య (1832 - 1909) : ఇతడు నెయ్యా శార్పట్టి సుబ్బయ్యకొడుకు. ఆంధ్రములికినాటి శాఖీయుడు. ఇతనిసోదరుడు కోదండరామయ్య కొనగోలు పాటగాడు. ఇతనిది మంచి మనోధర్మ సంగీతం, ఇతని కల్పనస్వరములు క్లిష్టమైన చిత్రవిచిత్ర తాళగతులలో బంధింపబడిన జాతుల లోనివి ఎట్టి కష్టమైన పల్లవినైన నవలీలగ బాడెడివాడు. ఇతనికి వేయి త్యాగరాయ కృతులు కంఠస్థంగా వచ్చుటచే శ్రీరాములవారికి సహస్రార్చన జేసెడివాడు. ఇతని మల్లికా వసంత, శుభపంతువరాళి కృతు లితని రచనాపాటవమును ధృవపర్చును. ముత్యాల్పేట త్యాగయ్య యింటిలో యితడు సావేరిరాగము నెనిమిదిగంటలు పాడి అందరినీ ఆనందింప జేసెను. మేళక్రమపద్ధతిని వేయిరాగముల నమర్చి దాని కారోహ అవరోహ స్వరముల నిచ్చెను. మంచి లక్ష్య లక్షణ విద్వాంసుడు. అనేకకృతులు, వర్ణాలు, తిల్లానాలు రచించెను. మైసూరురాజావారిచే సన్మానింపబడెను. ఇతడు

బందరు మున్నగు నగరములకు వెళ్లి కీర్తిగడించెను. కీర్తనలకు శేషముద్ర నుంచెను.

కరూరి చినదేవుడు: (1860-1900) ఇతడును దక్షిణామూర్తియు పినతండ్రి పెత్తండ్రిబిడ్డలు. దేవుడయ్య కరూరి నర్సయ్యకొడుకు. ఇతనికి పుట్టుకలోనే సంగీతజ్ఞాన మబ్బినది. మంచి గాత్రజ్ఞుడన్నూ, ఫిడలరు. పట్నం సుబ్రహ్మణ్యం, శరభశాస్త్రివంటి ఘనవిద్వాంసులకు పక్క-వాద్యమును వాయించెను. ఉదయార్పాళెంరాజా పోషకత్వమున నితడు మద్రాసులో గానశాలను తెరచి విద్యార్థులను తయారుచేసెను. గర్భపురిముద్రలోనున్న దక్షిణామూర్తి కృతుల కితడు వర్ణమెట్లను తయారించెను. ఇతనికి చిన్నాస్వామియను సోదరుడు గలడు. 38 వ యేటను మంచి ఉచ్ఛదశలో మరణించెను. ఇతని శిష్యుడే శ్రీ కంఠయ్య.

సి. యస్. కృష్ణస్వామి: (1865–1925) తిరుచునాపల్లి నివాసం. కాకినాడ (గోదావరిజిల్లా) లో చాలకాలముండెను. అందుచేత "కాకినాడ" కృష్ణయ్య అని మారుపేరు గలదు. పట్నం సుబ్రహ్మణ్యంగారి శుశ్రూషనుజేసి గాత్రమర్మమును గ్రహించెను. త్యాగరాజ శతకీర్తనస్వరావళి, వేంకటేశ తానవర్ణాలు, ప్రథమగానశిక్ష అను గ్రంథములను ప్రకటించెను.

శ్రీ కంఠయ్య (1870 – 1914) (కరూర్ వంశము) కరూరు భాస్కరపంతులు వంశీకుడు. చినదేవుని శిష్యుడు.

ఫిడేలుస్కూలును మదరాస్‌లో నడిపెను. ఇతనికొడుకే పాప వేంకట్రామయ్య అను ప్రఖ్యాత ఫిడలరు.

చిన్నాసామి: దేవుడయ్య శిష్యుడు, ఫిడలర్. త్యాగరాయ గానసంప్రదాయమును భక్తితో పోషించెను. ఘన విద్వాంసులగు పుష్పవనం, కోనేరిరాజపురం, వైద్యనాథన్, పూచయ్యంగారు, పల్లడం, సింగంపట్టి ఆచార్యులవారి పక్కను ఫిడేలు ననుగమించెను.

పాప వెంకట్రామన్:— తిరువాన్‌కూర్ రాజాస్థాన విద్వాంసుడుగా నున్నాడు. తండ్రివద్దనే గానమభ్యసించెను. అనంతరం గోవిందసామి పిళ్లై శుశ్రూషను జేసి ఫిడేలులో ప్రశస్తిని గాంచెను. స్వతంత్రబాణీని సృజించెను. ఇతని వాద్యం, కచేరీ అనంతరంకూడా ప్రతిధ్వనించును. ప్రముఖ మదరాస్ రేడియో వాద్యకుడు.

వెంకట్రామశాస్త్రి (1870):— వైణికుడు. అనేక కృతులను వ్రాసి సంగీత స్వయంబోధిని అనుపేరిట 1892లో ముద్రించెను.

పట్టుకోట శ్యామభాగవతార్ (1872–1924): — శెయ్యూరు రామస్వామివద్దను సంగీతము నేర్చెను. గొప్ప హరికథకుడు. ఇతని అభిమానకథ రాందాస్ శ్రోతలను భక్తి పారవశ్యులను జేసెడిది. త్యాగరాయకృతులను సభాపతయ్య చరిత్రనిరూపణ ప్రవచనములను సుప్రసిద్ధముగా చెప్పేవాడు.

శ్రీవెంకటేశ్వరుని భక్తుడు గనుక అక్టోబర్‌లో శ్రావణోత్సవమును జరిపేవాడు.

పుదుచ్చేరి రంగస్వామి (1888-1920) :— ఇతను ప్రవేశ పరీక్షవరకు ఫ్రెంచిభాషలో చదివెను. ఇతని గానాభిరుచిని పెంపొందించుటకు ఎట్టియాపురం రామచంద్రభాగవతులు వద్ద కితనిని పంపించెను. గానములో ప్రావీణ్యతను సంపాదించి పిఠాపురం, విజయనగరం, కాకినాడ మున్నగు పట్టణములలో గానసభలుచేసి సభ్యులను మెప్పించెను. వేంకటగిరి మహారాజా యితనికి బంగారు కంకణ మిచ్చెను. తిరుకోడికావల్ కృష్ణయ్య, గోపాలకృష్ణయ్య, (ఫిడల్సు), అలగనంబి, మాముండియపిళ్ళె, దక్షిణామూర్తి మున్నగు మార్దంగికులు ఇతనికి సహకారవాదకులుగ నుండిరి. కంచిలో నున్నపుడు నైనపిళ్లె యితనితో అనేకవిషయములను ముచ్చటించెను. కుంభకోణములో స్థిరవాసమును గల్పించుకొన్నపుడితనికిన్నీ పంచాపకేశ భాగవతారుకును పరిచయం గల్గెను. అతని కృతుల కితడు చిట్టస్వరాలు వ్రాసెను. ఇతను చాలా త్యాగరాయకృతులు పాడేవాడు. శుద్ధబాణీలో సాహిత్య భావములో కీర్తనలను పాడెను. గొప్ప స్వరనిర్మాత. త్యాగరాయలవర్ధంతి సంబరంలో పాల్గొని మంచికీర్తిని బడసెను. ఇతని శిష్యుడు సాకోట రంగయ్యగారు.

పల్లితాపం గోపాలకృష్ణయ్య (1886-1941) కారూరు నివాసి. వైగరు వరదాచార్లవారిశిష్యుడు. ఇతడు అభినయం,

గాత్రం, వీణ, ఫిడేలు, కంజీరా, ఘటవాద్యములలో గొప్ప ప్రవీణుడు. ఇతను పునహా, బొంబాయి ఆదిగాగల పట్టణములలో కచేరీలు జేసెను. 12 గ్రహరాసులకు 12 స్వరముల పైని గణించి జ్యోతిషమును జెప్పెను. త్యాగరాజు కీర్తనలన్నీ బీజాక్షరసంయుక్తము లను నమ్మికతో వానిని సాహిత్య దోషములతో పాడినచో కీడువాటిల్లునని చెప్పెను. గనుక సాహిత్యమునకు ప్రాధాన్యత నిచ్చెను.

ప్రతాపం నటేశయ్య: గోపాలకృష్ణయ్య శిష్యుడు. వానమామల తోటాద్రి, అరియకుడి మున్నగువారి శుశ్రూషనుజేసి గానము నభివృద్ధి జేసుకొనెను. కొంతకాలం రసిక రంజనీసభ గానపాఠశాలలో అధ్యాపకుడుగ నుండెను.

చల్లగాలి ఆదిమూర్తయ్య: కృష్ణయ్య సోదరుడు. తంజావూరు ఆస్థానగాయకుడు.

స్వరగత్తు నారాయణస్వామి: పుదుక్కోట నివాసి. చిట్టి నారాయణస్వామి శిష్యుడు. స్వరకాడు సుబ్బయ్య వంశీకుడు. స్వరగత్తు వాద్యప్రవీణుడు. అగాధమైన సంగీత జ్ఞానముగలవాడు. మహావైద్యనాథన్, శరభశాస్త్రి గార్లకు ప్రక్కవాద్యగాడు. తంజావూరాస్థాన విద్వాంసుడు.

గీతాల శేషయ్య: కంచినివాసి. పైడాల గురుమూర్తి శాస్త్రి శిష్యుడు. అనేక గీతములు, కృతులు రచించెను. గాత్రజ్ఞుడు. ఇతనిశిష్యులు నాగోజీరావు, గీతాల సుబ్బయ్య గార్లు.

అడ్డగంటి వీరాస్వామి: చెన్నపురి నివాసి. అనేక రాగమాలలు, తిల్లానాలు, స్వరజతులు రచించెను.

అక్కన్న వైణికుడు, వెంకటగిరి ఆస్థానవిద్వాంసుడు.

షట్కాలం నరసయ్య: ఆరుకాలాలలో కీర్తనలు పాడగల సమర్థుడు. వైణికుడు. వెంకటగిరి ఆస్థాన విద్వాంసుడు. వర్ణాలు, కృతులు రచించెను.

స్వరం కొండయ్య: బందరు నివాసి. మంచి గాన ప్రతిభగలిగి శైలి, స్వరములకూర్పు, శబ్దములసొగసు, మనోధర్మస్వరములు, పక్కతాళ పొందికలలో పాడుచుండెను.

గుడ్డి కృష్ణయ్య: తిరువాడి తాలూకా పున్నవాసాల్ నివాసి. పుట్టంధుడైనా సూదిలో దారము నెక్కించగల సునిశితప్రజ్ఞా ధురంధరుడు. మంచి జ్ఞాని, ఫిడేలరు. అనేకశిష్యులు గలరు.

రాముడు భాగవతార్: తిరువాడి పంచాప కేశన్ కొడుకు. మంచిగాయకుడు. త్యాగరాజస్వామివారి విగ్రహములను పూజించిన అదృష్టశాలి.

మధుర సుబ్రహ్మణ్యం: త్యాగయ్య వంశీకుడు. నైషధం శేషయ్య, కరూరు చినస్వామిచెంతను గానము నభ్యసించెను. ఇతని లక్ష్యలక్షణపరిజ్ఞానం యితనికి గాయక ప్రపంచంలో అగ్రస్థానము నిచ్చినది. గొప్ప గాయకుడు, ఫిడేలరును అగుటచే ప్రఖ్యాతగాయకుల సహకార వాద్యము చేసెను. అన్నమలై సంగీతశాలలో అధ్యాపకుడు. కొన్ని

రోజులు అడయూరు కళాక్షేత్రములో కూడ ఫిడేలు ఆచార్యుడుగ పని చేసెను. ఇతని శిష్యులు జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం, తంజావూరు లక్ష్మీనారాయణశాస్త్రి.

భుజంగ రామస్వామి: వీణ, కంజర, మృదంగ ప్రవీణుడగుటయే కాక గాత్రజ్ఞుడు, కథకుడు. గోవిందస్వామి, సంజీవరావుగార్లకు మృదంగ సహకారం జేసెను.

చల్లగాలి వీరరాఘవయ్య, అప్పయ్య సోదర్లు: తంజావూరు చిక్క ఒత్తప్పయ్య వంశీకుడు. అప్పయ్య మనుమడైన వరాహప్పయ్య ఆంగ్ల హిందూ గాన విద్యాసంపన్నుడు. ఇతనికభినవనారద బిరుదము గలదు. వీరిలో వీరరాఘవయ్యకు తంజావూరు రాజులు 'చల్లగాలి' బిరుదు నిచ్చిరి.

శిష్యులు: 1. లక్ష్మణ గోసాయి, 2. పరమేశ్వరభాగవతార్, 3. వడివేలు, 4. వీరరాఘవయ్య, 5. నీలకంఠశాస్త్రి, 6. వీణ ధర్మదీక్షితులు (అఖిలాండపురం) ఇతని కొడుకు గోపాలయ్య, మనుమడు కృష్ణయ్య.

తిరుకుంద్రం రామయ్య :— షట్కాల పల్లవి ప్రకాండుడు.

నాగపట్నం వెంకటస్వామి : గాత్రం, ఈల ప్రవీణుడు. ఫ్లూటువాద్యము నతిశయింపజేసెను.

చిదంబరం గురుస్వామి : ముదికొండ సభాపతి వద్ద గాత్రము నభ్యసించెను. ఇతని శిష్యుడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి అయ్యంగారు: పి. రంగస్వామిబంధువు. గురుస్వామి వద్ద గానమభ్యాసము గావించెను. గంభీర శాస్త్ర సమ్మత శుద్ధకర్నాటక గానప్రవీణుడు.

పట్టమంగళం ఈశ్వరన్-సాంబశివన్ : పుదుక్కోట నివాసి. వైణికుడు. హరిదాస్ రామచంద్రరావు శిష్యుడు. కొంతకాలం కళాక్షేత్రంలోను, రేడియో స్టేషనులోను పని జేసెను.

యల్. సుబ్రహ్మణ్యశాస్త్రి : (శర్మాదేవి) వీణ శేషన్న శిష్యుడు. 'కళ కళ కొఱకే' అన్నటుల గానమును కళాదృష్టితో చూచును. మదరాసు గానపరిషత్సభలలో అనేకసార్లు పాడెను.

తాడిచర్ల లక్ష్మీనారాయణశాస్త్రి (1916): కడపజిల్లాలోని సిద్ధవటం గ్రామనివాసి. తండ్రిపేరు వెంకటశాస్త్రి. అన్నామలై కళాశాల పట్టభద్రుడు – వైణికుడు. గోమతి శంకరన్, మధుర సుబ్రహ్మణ్యంగార్ల శిష్యుడు.

ఎన్. ముద్దుకృష్ణయ్య: (కొల్లాపురం)దండపాణయ్యర్ శిష్యుడు. మంచి వైణికుడు. ఇతని సోదరుడు రాముడు, మంచి మార్దంగికుడు.

పంచాపకేశన్, రాముడుసోదరులు: పంచాపకేశన్ 1936 లో, అన్నామలై కళాశాలలో 'సంగీతభూషణ' డిప్లొమాను పొందెను. ఢిల్లీ కర్నాటక సంగీతశాలలో 1928–43 వరకు ఆచార్యపదవి నందుండెను. పిమ్మట ఢిల్లీ రేడియో

నిలయ విద్వాంసుడుగా జేరెను. రాముడు మాయవరం లక్ష్మణరావు వద్దను మృదంగము నభ్యసించెను.

అలత్తూరు సోదరులు: వీరిలో వెంకటేశయ్య గొప్ప గాయకుడు, హార్మనిష్టు. శివసుబ్రహ్మణ్యం తిరువాన్‌కూర్ ఆస్థాన విద్వాంసుడు. అలత్తూరు సోదరద్వయం గాన ప్రపంచములో యుగళగానమునకు మంచి ప్రఖ్యాతిని గాంచిరి. వీరి రాగాలాపన స్వరకల్పన చిత్రతాళగతులు తిరువాన్‌కూర్ రాజు నాకర్షించినవి. మదరాసు సంగీతపరిషత్తులో వీరికి మంచిస్థానము గలదు.

## భరతశాస్త్ర ప్రవీణులు.

మెరటూరి వారి వంశము భరతశాస్త్రములోనే గాక సంగీతమునందు కూడా గొప్ప ప్రావీణ్యమును సంపాదించిరి. మూలపురుషుడు వేంకట్రామశాస్త్రి. త్యాగరాయల సమకాలీనుడు.

మెరటూరి అరుణాచలం (1831-95) త్యాగరాయల శిష్యపరంపరవారు. ఇతని పూర్తిపేరు 'స్వరకళానిధి' పట్టాభి అరుణాచలం. ఇతని తాత శివరామన్. అచ్యుతసముద్రం లేక మెరటూరు అను గ్రామ యీనాందారులు. ఇతని తండ్రి పట్టాభిరామయ్య. ఉషాకళ్యాణ, కంసవధేత్యాది యక్షగాన ప్రబంధకర్త. ఇతడు గొప్ప భరతనాట్య ప్రవీణుడు. అనేక నృత్యనాటికలను తంజావూరు వరదరాజస్వామి సన్నిధిని

ప్రదర్శించెను. ప్రఖ్యాతనాటకం ప్రహ్లాదచరిత్ర. ఇతనికి మంచి సంగీత జ్ఞానం కలిగి వేలాది ప్రజల నాకర్షించే గంభీర గాత్ర మొప్పియుండెను. నిజభక్తుడు గనుక ధనార్జన కొరకు విద్య నెంతమాత్రము ఉపయోగించ లేదు. ఇతడు అనేక వర్ణము లను రచించెను. అభిమాన విద్యలు రసవాదం, ఆయుర్వేదం. ఇతని యింటికి, ఘనవిద్వాంసులగు ఉమయాల్పురం కృష్ణయ్య, సుందరరామయ్య, వీణ సాంబయ్య వచ్చుచుండెడి వారు. నిర్భాగమాటముగా ఒకపు డితడు నాగస్వర విద్వాం శివకొలందును విమర్శించెను. ఇతని శిష్యులు శివగంగ వైద్యనాథన్, తంజావూరు సుబ్రహ్మణ్యంగారలు.

ఎం. వెంకట్రామజోషి (1858-1924) బొమ్మలాట ప్రదర్శనములో గొప్పనేటి. చంద్రమతిపాత్రను బాగా నడి పించేవాడు. నాట్యప్రవీణుడేకాక ఫిడేలు, స్వరబత్, కంజిరా, మృదంగం, చితారు, వీణలను వాయించుటలో గూడ అద్వి తీయుడు. హరికథాప్రదర్శకుడు. ఇవిగాక పీతాంబర్ విద్య, గారడీ, ఆయుర్వేదం, రసవాదములలో కూడ ప్రవీణుడు. ఏకసంథగ్రాహి. నల్లూరి నారాయణస్వామి యితనిశిష్యుడు.

మువ్వలూరి సభాపతి: త్యాగయ్యగారి సమకాలి కుడు. మానంబుచావడి వద్దను గానము నభ్యసించెను. భరతశాస్త్రప్రవీణుడు. ఇతని పదములను నేటి నట్టువకులంతా పాడుచున్నారు. ఇవి భక్తిశృంగారభరితములు. మన్నార్గుడి రాజగోపాలస్వామి కంకితమిచ్చుటచే దీనికి 'రాజగోపాల

ముద్ర' వున్నది. కొన్ని చరిత్రనిరుపానములు వ్రాసెను. సీతాకళ్యాణంలో వానప్రస్థఘట్టం చాలా జాలికరంగా నున్నది.

## హరికథాప్రవీణులు

సూత్రం నారాయణశాస్త్రి (1849-1909) (తిరుపతి) గానవిద్యావిశారదుడు, తర్కశాస్త్రజ్ఞుడు, హరికథకుడు. ఇతడు ఘటికాచలమహాత్మ్యమును సంస్కృతంలో వ్రాసెను. హాథీరాం బావా, మార్కండేయ, చంద్రహాస హరికథలను వ్రాసెను. అష్టావధాని.

రాధాకృష్ణశాస్త్రి (1858-1907) గీర్వాణభాషా పారంగతుడు, కవి. అనేక హరికథలనువ్రాసి వానిలో ఆంధ్ర గీర్వాణ, ద్రావిడ, మణిప్రవాళ భాషాకీర్తనలను జొప్పించెను. దివాన్ శేషశాస్త్రిచే గౌరవింపబడెను.

గోవిందస్వామిభాగవతార్ (1861-1921) తంజపురి కృష్ణభాగవతార్ శిష్యరికంజేసి 18 ఏండ్లు కథల నభ్యసించెను. బహుభాషాకోవిదుడు గనుక తెనుగు, అరవం, కన్నడం, మరాటీ భాషలలోని గీతములను చేర్చి మిశ్రకథలను చెప్పేవాడు. పురాణగాథలను చెప్పుటలో మంచినేర్పరి. వేంకటేశకళ్యాణం, మీనాక్షీకళ్యాణం, లవకుశ, గౌరీచరిత్రలను హరికథలను రచించెను. మంచి ఫిడలరు, గాత్రజ్ఞుడు. ఉదయార్పాలెం ఆస్థానగాయకుడు. త్యాగరాయ ఆరాధ

నోత్సవములను ప్రారంభించినవారిలో ప్రథముడు. శిష్యులు: మనుమడాత్మనాథ భాగవతార్, నారాయణ భాగవతార్, రామస్వామి, సుబ్రామయ్య, కన్నయ్యనాయుడుగార్లు.

## త్యాగరాయ సమకాలీనులు

శామశాస్త్రి (1763-1827) "నాదోపాసనచే శంకర నారాయణవిధులు వెలసిరి" అను శ్రీత్యాగరాయ కీర్తన దెల్పినటుల త్రిమూర్తులు మువ్వురు గానవిద్య నీలోకమున వ్యాపింపజేయుటకు, గానమే ముక్తిమార్గమని నిరూపించుటకు త్యాగరాయ, శామశాస్త్రి, ముద్దుస్వామిదీక్షితర్ వాగ్గేయ కారత్రయం దక్షిణాదిని తిరువయ్యారులో జన్మించిరి.

ఈకాలముననే యూరపులో పాశ్చాత్యగాయకోత్తము లైన బీథోవన్, మొజార్టు మున్నగువారు ప్రభవించిరి. సంగీత స్వర్ణయుగమని చాటుటకు క్రీ. శ. 1750 – 1850 మధ్యను వీరందరూ జన్మించిరి.

శ్రీనగరమని పిల్వబడు తిరువయ్యారులో గౌతమ సగోత్రి బోధాయనసూత్ర వడమబ్రాహ్మణజాతికి జెందిన విశ్వనాథయ్యర్‌కు 1763 లో శామశాస్త్రి జన్మించెను. వీరి పూర్వులది కంభంజిల్లా. ఇతని అసలుపేరు సుబ్రహ్మణ్యం. కాని శామకృష్ణ యను ముద్దుపేరులో పిలువబడుచుండెను.

బ్రహ్మ ఒకకాలమున కంచిలో తపస్సుచేయుచుండగా దేవియొక్క దివ్యజ్యోతిచే ఆతనికి నేత్రావరోధము కలిగెను

ఈ విషయమును ధృవపర్చుటకు స్వర్ణకామాక్షి విగ్రహ
మును జేసి దేవళములో ప్రతిష్ఠించెనట. జగద్గురు శంకరుల
వారు కంచికి వచ్చినపుడు ఆదేవాలయం పూజా పునస్కార
ములు లేక పాడువడి యుండుటనుచూచి సంప్రోక్షణముచే పరి
శుద్ధిజేసి దానికి నిత్య పూజా కైంకర్యములు జేయుటకు
పవిత్ర స్మార్త బ్రాహ్మణులు కావలెనని, ఇతని పూర్వీకులను
పూజారులుగా నియమించిరి. 1565 సం॥రంలో తురకల యొత్తి
డికి తాళలేక జింజీకిపోయి 1594 లో స్థిరపడిరి. ఈవిధంగా
అనేక బాధలకు గురియై ఉదయార్పాలెం, నాగూరు మున్నగు
గ్రామముల మీందుగా తిరువాడి జేరిరి. తురకల దాడి ఎక్కు
వగుటచే శామశాస్త్రి తండ్రి తులజాజి రాజుగారి రక్షణను
కోరగా వీరికి తంజావూర్‌లో ఆశ్రయమిచ్చిరి. నాడు లగా
యతు శామశాస్త్రి మరణ పర్యంతం అనగా 1827 వరకు
అచ్చటనే నిల్చిపోయిరి. వీరి యనంతరం వీరి వంశీకు లచ్చ
టనేవుండి కామాక్షీ విగ్రహమును పూజించుచుండిరి.

బాల్యమునందు శామశాస్త్రి ఆంధ్ర గీర్వాణ ద్రవిడ
భాషల నభ్యసించెను. పిమ్మట శ్రీవిద్యలో సంగీతస్వామి
యను ఆంధ్రయతిచే శ్రీవిద్య నుపదేశింపబడి పచ్చిమిరియం
ఆదెప్పయ్య, వీరభద్రయ్య గాయకుల ప్రౌఢరీతులను నేర్చి
శ్రీకామాక్షి ప్రసాదముచే పెక్కుకీర్తనలు, స్వరజతులు
రచించి శామకృష్ణ ముద్రతో బాడుచుండెను. ఆదెప్పయ్య
యితనిని గౌరవించి 'కామాక్షి' పేరులో బిలిచెను. తండ్రి

గారి యర్చకత్వములు ఇతనికి ప్రాప్తించుటచే దేవమాన్యముల రాబడిలో కుటుంబభరణమును జరుపుకొనుచుండెను.

కృతి ప్రశస్తి: ఇతని కృతులలోని ప్రశస్తి యొకపు కాలపు రీతులు, కదళీపాకము ననుసరించు రాగశయ్య, క్లిష్టమగు తాళగతులచే అతీతానాగతగ్రహములలో కూడి పాడుటకు కష్టమగుటచేతను, స్వరసాహిత్య ప్రకర్షతో గూడుటచేతను నేర్పరులు గాని వాటిని రంజకముగను సంప్రదాయసిద్ధముగను బాడ జాలరు. అందుచే ఇతనికి 'తాళప్రస్తార' శామయ్య అని బిరుదు గలదు. ఇతని వ్రాతప్రతు లిప్పటికినీ యితని కఠినపోకడలను నిరూపించుచున్నవి. ఈ కీర్తనలు మధుర రాగభావములచే నొప్పుచూ దేవీ స్తోత్ర పరమై యున్నవి. ధ్యానమగ్నుడై రచించిన కీర్తన లగుటచే వీని సంఖ్య చాలతక్కువ. ఇతడు వ్రాసిన 300 కృతు లిపుడు ప్రచారములో లేవు.

మీనాక్షీ నవరత్నములు, ధర్మసంవర్థని, కామాక్షి, బృహన్నాయకి పైని కీర్తనలను గూర్చెను. మధురమైన ఆంధ్ర గీర్వాణ తమిళ భాషలలో వీనిని గానార్హములుగా వ్రాసెను. త్యాగయ్య కృతులవలె గాక యితని కీర్తనలఖండ మనశ్శాంతిని ఆత్మతృప్తిని వెలిబుచ్చుచున్నవి.

త్యాగయ్య కీర్తనలలో మానసిక వ్యథలు సంసార బాధలు వ్యక్తమగును. శామశాస్త్రి కీర్తనలలో బిడ్డడు తన

ఆర్తిని తల్లికి దెలుపునట్లు స్పష్టమగుచున్నది. ఇతని ఆనంద భైరవి కీర్తనలలో ప్రత్యేకతగలదు.

మాంజి, కలగడ, చింతామణి యను అపూర్వరాగములలో కీర్తనలను వ్రాసెను. చాపు తాళంపైని అభిమాన మెక్కువ. ఇతని తాన వర్ణాలు, స్వరజతులు విద్యార్థులకు మిగుల ప్రయోజనకరము. త్యాగయ్య దీక్షితుల వారితో కలసి తరచుగ ప్రసంగించెడువాడు. దీక్షితుల కితడు పొడు కాంత శాక్తదీక్ష నిచ్చెను. ఎన్నడునూ యాత్రలకు పోవక తన డబ్బుతో తృప్తిపడుచూ జీవితమును గడపెను. ఇతని కొడుకు సుబ్రాయశాస్త్రి త్యాగయ్యగారి శిష్యుడు. ఇతనికి నిగ్రహానుగ్రహ శక్తులు కలవు. ఒకరోజున తంజాపురిలో కోమటి యొక డితనిని అర్చకుడని హేళనచేయగా శాప దగ్ధుడై చచ్చెను. తనకు రాబోవు మరణమునకు ముందుగ అయిదురోజులు తనకు వ్యవధి వున్నదని చెప్పెను. ఆరో రోజున (1827) వ్యయసంవత్సర మకర మాస శుక్ల దశమి నాడు గానజ్యోతిని వెలిగించి, భౌతికదేహమును చిదానందముతో విడిచిపెట్టెను.

## శిష్యపరిగణం

ఆలసూరి కృష్ణయ్య : మైసూరు ఆస్థాన విద్వాన్, పల్లవి ప్రవీణుడు.

దాసరి : నాగస్వర కోవిద, ఒకనాడు తిరువయ్యారు స్వామి ఊరేగింపు సేవలో శుద్ధ సావేరి రాగాలాపన పల్లవి

పాడి "దారిని తెలుసు కొంటిని" అను కృతితో ముగించెను. త్యాగరా జితని ప్రతిభను మెచ్చి కౌగలించి ఆశీర్వదించెను.

పుదుకోట శేషాచలం : 1741 సం॥ జననం. పుదు కోట సంస్థాన విద్వాన్. ఇతని కొడుకే మాతృభూతయ్య. ఇతని సోదరుడు రాందాస్. రామముద్రతో కృతుల నల్లెను. ఇతని శిష్యులు స్వరకాడు సుబ్బయ్య. మనుమడు గోపాల స్వామి కృతికర్త.

శామశాస్త్రి గానప్రతిభ : చింతామణి రాగములో "దేవి బ్రోవసమయ మిదే" నని కృతిని రచించి దేవి ఆశీర్వ చనమును బొంది బొబ్బిలి కేశవయ్య అను విద్వాంసుని, నాగ పట్నంలో అప్పుకుట్టిని ఓడించెను.

రాజధిక్కారం : 1826 లో మైసూర్ రాజా యితని నాహ్వానించి సత్కారము చేయదలచగా తిరస్కరించెను. ఇతనికి జ్యోతిశ్శాస్త్ర ప్రవేశం గలదు.

## వా ర సు లు.

ఇతనికి పంజుశాస్త్రి, సుబ్రాయశాస్త్రి అను యిద్దరు కొడుకులు. జ్యేష్ఠుడు కామాక్షి దేవాలయ అర్చకుడు. ఇతని ప్రథమ భార్యకు రామకృష్ణ, సాంబశివం, అన్నాస్వామి యను మువ్వురు పుత్రులు గల్గిరి. రామకృష్ణుని పెద్దకొడుకు నటేశం పూజారిగా వుండెను. ఇతని వద్దను శామశాస్త్రి వ్రాసిన లక్ష్యలక్షణప్రతు లున్నవి. వానిలో తాళప్రస్తా

రములు, షోడశాంగ ప్రస్తారములు, చిత్రములు గలవు. సాంబశివం బ్రహ్మజ్ఞాని, వేదాంతి. అన్నాస్వామిని సుబ్రాయ శాస్త్రి దత్తత జేసుకొనెను.

అన్నాస్వామి (1827–1900) : అసలు పేరు శామ కృష్ణ. తండ్రివద్దను కావ్యనాటకాలంకార గానశాస్త్రము లభ్యసించెను. ఫిడలరు. రచయిత. తానవర్ణాలు, కృతులు రచించెను. "పాలించు కామాక్షి" "పాహిశ్రీ గిరిరాజసుతే" అను ఆనందభైరవి కీర్తనలకు స్వరసాహిత్యమును వ్రాసెను. 72 మేళకర్తల రాగలక్షణాలు వ్రాసెను. వీణ కుప్పయ్యతో కలిసి అపూర్వపల్లవులకు స్వరకల్పన చేసి పాడెను. మేల కార్ గోవిందన్, కామాక్షి యితని శిష్యులు ఇతనికి శామ శాస్త్రి యను కొడుకు గలడు. ఇతను చిత్రలేఖకుడు, ఫిడలరు. అన్నాస్వామి 1900 సంవత్సరములో చనిపోయెను.

ముద్దుస్వామి దీక్షితరు :—

వంశావళి : రామస్వామి దీక్షితర్ (1735–1817) ఇతడు ముద్దుస్వామి దీక్షితులు తండ్రి. కాశ్యపగోత్ర ఆపస్తంభ సూత్ర స్మార్త వైదిక బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. ఇతని తలిదండ్రులు భాగీరథీఅమ్మ, వేంకటేశ్వర దీక్షితులు. బోధేంద్ర గురువుల వారిచే నుతికెక్కిన తిరువడమరనూర్ చెంతనున్న గోవిందరాజపురమునకు బోయి ఆంధ్ర గీర్వాణ భాషల నభ్యసించెను. తండ్రి యనంతరం తంజావూరులో వీరభద్రయ్య వద్దను రెండువత్సరములు గాన మభ్యసించెను.

పిమ్మట మధ్యార్జునమున కేగి వేంకటమఖి బంధువగు వైద్య నాథ దీక్షితులవద్ద వీణను సంగీతలక్షణముల నభ్యసించెను. తంజావూరు రాజితనికి గొప్ప సత్కారములను చేసెను. మణలి చిన్న మొదల్యారితనికి సువర్ణాభిషేకమును జేసెను. 108 రాగతాళమాలికను రచించెను. హంసధ్వని రాగము నితడే సృష్టించెను. ఇతడు దేవీ ఉపాసకుడు. ప్రతి ఏకాదశి రోజున జయదేవుని గీతగోవిందములన్నియు పాడుచుండెను. అనేక రాగమాలికలు, చౌకవర్ణాలు, తానవర్ణాలు, కీర్తనలు వేంకట కృష్ణ ముద్రతో రచించెను. ఇతడు రచించిన ప్రబంధములో హంసధ్వనికి రక్తి, పుష్టి, స్వరూపముల నిచ్చి రాగసంచార క్రమపద్ధతిని వ్యక్తపరచెను. అమరసింహుని ఆశ్రియముచే సుఖకాలక్షేపము జేయుచుండెను.

కాని సంతానము లేదను కించతో అనంత తాండవ పురిలోని ముద్దు కుమారస్వామిని 40 దినములు దీక్షతో ప్రార్థించెను. వరప్రసాదమున భార్య గర్భవతియై 1775 సం॥ రంలో ముద్దుస్వామి దీక్షితులను బడసెను. అనంతరం వైద్యనాథన్, చిన్నస్వామి అను యిద్దరు పుత్రులును, బాలాంబ, బాలస్వామియును జన్మించిరి. వేంకటమఖి ప్రపౌత్రుడగు గోవిందదీక్షితులు మణలికి పోయి రామస్వామిని పరీక్షింప నెన్నించగా అతడు తన పుత్రులగు చిన్నస్వామి బాలస్వాములచే వేంకటమఖి సంప్రదాయం ప్రకారం పాడించగా గోవిందదీక్షితు లతనికి చతుర్దండిప్రకాశికను

బహూకరించెను. ఇతని రెండవ కొమారుడు చిన్నస్వామికి దృష్టి మందగించుటచే శ్రీక్షేత్రమున కేగి వేంకటేశ్వర్లవారిని 40 రోజులు సేవించి 48 రాగాలలో "మనసా వేరురీతుల దలచక" యను రాగమాలను వేగవాహినిలో "ఇంకా దయ రాకున్న" అను కీర్తనను పాడెను. దీక్ష ముగియు లోపల భగవత్కటాక్షముచే నితనికి దృష్టివచ్చెను.

కొంతకాలమునకు వీరింటికి చిదంబరనాథయోగి భిక్షకేతెంచి ముద్దుస్వామి వారి జితప్రజ్ఞ, విద్యాశక్తులను పరీక్షించి, మోక్షసాధనం బగు గానవిద్యను గరపి నుత్తీర్ణుని గావింపవలెననే ఆశతో తనతో కాశీధామమునకు గొంపోయెను. యోగివర్యుని కటాక్షముచే కాశీలో ముద్దుస్వామి శ్రీవిద్యాప్రభావంబున తత్త్వవేత్తయై యోగప్రభావముచే అణిమాదిసిద్ధులను పొందెను. అచ్చటనున్న హిందూస్థానీ గాయకుల సంసర్గచే గానములో ప్రవీణుడయ్యెను. ఎమన్, ద్విజావంతి, బృందావని, సారంగ, హిందోళ రాగాలలో కీర్తనలను వ్రాసెను. ఈవిధంగా తన కొమరుని కూలంకష సంగీతజ్ఞానమును జూచి ఆనందించి రామస్వామి తన కొడుకు కీర్తిమయముక్తాసౌధమున నుండగలిగె నను ఆనందముతో 82 సంవత్సరములు జీవించి 1817 లో తన భౌతికశరీరమును వీడి పరమపదవి నలంకరించెను.

చిన్నస్వామి దీక్షితులు : ఇతడు రామస్వామి కనిష్ఠ పుత్రుడు. సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడు.

గాత్రము వీణల ద్వారా గానసారమును శాస్త్రీయంగా శ్రోతలకు పంచిపెట్టిన ప్రజ్ఞావంతుడు. మణలి చిన్నయ్య యితనిని సన్మానించెను. ఒకనాడు తిరువాన్కూర్ పండిత పరిషత్ లో 'నాగవరాళి' రాగము నాలాపించుచుండగా పన్నగము వచ్చి పడగనువిప్పి కొంతతరి నాట్యము చేసి అలసిపోయి సాష్టాంగం చేసి పోయెను. బాలుస్వామితో కలిసి మధురకుబోయి అన్న గారి కృతులను పాడెను. నారదునిపైని తోడిరాగములో "గానలోల కరుణాలవాల" అను కీర్తనను రచించెను. 45 వ ఏటను మరణించెను.

బాలుస్వామి దీక్షితులు (1786 – 1858) : ఇతడు పరాభవసంవత్సరంలో జన్మించెను. ఆంధ్రభాషా కోవిదుడు. వీణ, స్వరబత్తు, ఫిడేలు, సితార్, మృదంగం కడు నిపుణతతో వాయించెను. గానరహస్యవేది శ్రీ కార్తికేయస్వామి పైని సారంగ, దర్బారి, రుద్రప్రియ రాగాలలో కీర్తనలనువ్రాసెను. మణలి చిన్నయ్య యితనిని ఒక ఆంగ్ల ఫిడలర్ శుశ్రూష క్రింద వుంచి ఫిడేలు అభ్యాసం చేయించెను. ఇంగ్లీషు గాన శాస్త్ర పరిజ్ఞాన మబ్బిన తర్వాత అనేక సంస్థానములలో గౌరవింపబడెను. శొంఠి వెంకటసుబ్బయ్య టక్కరాగము తన సోమ్మని మొదలితో చెప్పుచుండగా విని దానిని వెంటనే వాయించి చూపి అట్లనుట పాడిగాదని నివారించెను. 'అరమరలు అపరాధ'మ్మను టక్కరాగ గీతం ప్రసిద్ధిలోకి వచ్చినది. ఇతని 'వల్లీ దేవసేనాపతి' 'నీవే రసిక శిఖామణి'

'రాజశిఖామణి నిన్నే నెరనమ్మితి' అను కీర్తనలు ప్రచారంలో నున్నవి. ఇతని సోదరుడు చిన్నసామి మధురలో హఠాత్తుగా మరణించుటచే రామేశ్వర యాత్రకై పోయి తిరుగుదలలో ఎట్టియాపుర సంస్థానమును జేరెను. అచ్చటి రాజైన వేంకటేశ్వర్ ఎట్టియప్ప యితని ఫిడేలు వాదనా కౌశల్యమునకు అచ్చెరువంది తన ఆస్థానములో నిల్పుకొనెను. అంతేకాక తన కొమారుడైన రామకుమారునకు సంగీతమును నేర్పించెను. మరియు యితనికి ద్వితీయ వివాహమును జేసెను. ప్రతి ఏకాదశిని ఉపవాసము జేసి గీతగోవిందములను పాడుచూ భగవద్భజనతో కాలము గడపెను. నిర్యాణం: 1858.

సుబ్బరామ దీక్షితులు: (1839–1907) గాన శాస్త్రజ్ఞుడు. ఆంధ్ర గీర్వాణ తమిళభాషలలో కవి. ఎట్టియాపుర ఆస్థానవిద్వాంసుడు. ముద్దుస్వామిదీక్షితుల కొడుకు. అనేక గీతాలు, వర్ణాలు, కృతులు, రాగమాలలు, సంచారాలు వ్రాసెను. లక్ష్యలక్షణయుతమగు సంగీతసంప్రదాయప్రదర్శిని గ్రంథము రెండుభాగములును, ప్రథమాభ్యాసమును ప్రకటించెను. ఇతని దత్తతతండ్రి యితనికి బ్రహ్మోపదేశమును, శ్రీవిద్యోపాస్తిని ఉపదేశించి కావ్య, నాటకాలంకారాదులు, మనుచరిత్ర, వసుచరిత్రాది కావ్యపఠనమును, వ్యాకరణ ఛందశ్శాస్త్రములును నేర్పెను. సంస్కృతాంధ్రభాషలను కృష్ణయామాత్యునివద్ద పఠించె. తండ్రివద్దను వీణాభ్యాసం సంగీత లక్షణములను నేర్చెను. పదిహేడవ ఏటనే కార్తి

కేయుని పైని దర్బారులో ఆటతాళవర్ణమును రచించెను. ఏమన రాగములో మత్సరగ్రస్తుల నవమానించుటకు స్వర జతిని వ్రాసెను. మహారాజుపైని నృత్యోపయోగమైన చౌక కాలవర్ణములు, నవరాగమాలికను వ్రాసెను. రామక్రియ రాగంలో తానవర్ణం, శంకరాభరణంలో కీర్తనను రచించి కుంభకోణ ఆచార్యమఠములో వీణ సుబ్బుకుట్టి, రాముడు భాగవతార్ తదితర పండితులమోల పాడి వినిపించెను.

విద్యావాచస్పతి ముద్దుస్వామి దీక్షితర్: 1775-1835.

"నాదసముద్ధరణార్థం సంభవామి యుగేయుగే" అను సూక్తి ప్రకారము భగవంతుడు గానత్రిమూర్తులరూపమున యవత రించెనని దెల్పుటకు త్యాగయ్య శామశాస్త్రి దీక్షితులవారు ఈ మహిని జన్మించిరి. వీరిలో శామశాస్త్రి లయబ్రహ్మగను సర్వాంతర్యామి అద్వితీయుడునై వేలకొలది రాగములను సృష్టించి స్థితిలోనికి దెచ్చును గాన త్యాగయ్య విష్ణువుగను లయకర్త స్మశానవాసి యోగతపస్సు నేత్రములలో ప్రజ్వ రిల్లుముక్కంటి ప్రళయభయంకరుడును సుశిక్షితులైన భటుల వలె నియమములను తప్పక నడిపించుకొనువేల్పు నగు నీశ్వర రూపుడు ముద్దుస్వామి, త్రిమూర్తులను ధ్యానించునపుడు మన మనస్సులో కల్గు భావములీ త్రిమూర్తుల కీర్తనలను విన్నంత మాత్రమున కల్గును. కర్నాటక వాగ్గేయకారులలో ప్రసిద్ధి గాంచిన త్యాగయ్య దీక్షితవర్యులు మనకు విష్ణుమహేశ్వ రులవలె సదాపూజనీయులు. వీరిద్దరు నాదమూర్తికి రెండు

నేత్రముల వంటివారు. ప్రాచీన సంప్రదాయసిద్ధముగా వీ రనేక కీర్తనలను రచించిరి. గొప్ప నాదోపాసకులు నాద విద్యను మోక్షసాధనిగా నెంచిన గాయకోత్తములు.

1775 సం॥రంలో యితడు రామస్వామి దీక్షితరు సుబ్బమాంబలకు పుత్రుడుగా జన్మించెను. ఇతని సోదరులు చిన్నస్వామి, బాలు కూడా గొప్పగాయకులు. ముద్దుస్వామి బాలాంబికా వరప్రసాదుడు. చిన్ననాట తనతండ్రివద్దనే సం గీత సాహిత్యముల నభ్యసించెను. ఇదిగాక జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుడు. ఏకసంథగ్రాహి. "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్మ"ను నట్లితడు హంసధ్వనిలో "వాతాపి గణపతిం" యను విఘ్నే శ్వర స్తవమును రచించి తండ్రిఆత్మను తృప్తిపరచెను.

వీరు మణలి జమీందారు నాశ్రయములో నున్నపు డొకతరి చిదంబరనాథయోగి వీరియింటి కేతెంచి ఇతనిగాన మును విని తృప్తిజెంది, శ్రీవిద్యా మంత్రోపదేశమును గావించి తనతో కాశీక్షేత్రమునకుంగొంపోయి గానవిద్యలో నుత్తీర్ణుని గావించెను. సద్గురు ఆశీర్వచనమును బడసి మగిడి స్వగ్రామమునుజేరెను. అచ్చట అంతర్యాగ బహిర్యాగము లను జేసి 'గురుగుహమూర్తిని' (సుబ్రహ్మణ్యేశ్వరుని) దర్శిం చుటకు తిరుత్తనికి బోయి అచ్చట తన మాతృశ్రీవలె 40 రోజు లుపవసించగా దీక్షానంతరం వకరోజున దేవుడు ప్రత్యక్షమై యితనినోట కండచక్కెర నునిచి అంతర్ధాను డయ్యె. పులకాంకితగాత్రముతో స్వామిని ధ్యానించుచుండగా

యితనికి జ్ఞానోదయమయ్యెను. వెంటనే స్వామిపేరట "గురుగుహో జయతి" అని గురుపరముగా 20 కీర్తనలు రచించెను. ఈ గురుకీర్తనలు జగత్ప్రసిద్ధములు. కీర్తనలను మాలలగా రచించుటలో నితడు కడునిపుణుడు. ఇతనిముద్ర గురుగుహ అన్నది. అనంతరము తిరుత్తనిని విడిచి తనసోదరునితో కలసి కంచికి వేంచేసెను.

అచ్చటనే త్యాగయ్య శామశాస్త్రి ప్రభృతులిర్వురూ మంత్రోపదిష్టులై అచ్చట శ్రీవిద్యోపాసనను శ్రద్ధతో జేయుచూ ఉపనిషద్బ్రహ్మము వారిని సేవించుచుండిరి. ఇతడు శ్రీవారు రచించిన రామాష్టపదులకు రాగతాళవర్ణమెట్టులను అమర్చిరి. కొన్నిసంవత్సరములు గడపినపిమ్మట దీక్షితులు తిరువయ్యారున కేతెంచి శ్రీత్యాగేశుని సేవించుచూ నదీతీరమునందు నిత్యమూ సచ్ఛాస్త్రపఠనాది నియమములతో 'ప్రాణారామము మన ఆనందం, శాంతిసమృద్ధమమృతం' అన్నటుల శాంతచిత్తముతో కాలమును గడపెను. ఇచ్చటనే త్యాగేశ ఆనందేశ అచలేశ హాటకేశ వల్మీకేశులపైననూ షోడశగణపతులపైననూ కీర్తనలను రచించెను. అన్ని శివక్షేత్ర విష్ణుక్షేత్రములను దర్శించి, శ్రీవేంకటేశ కాశీవిశ్వేశ పంచలింగక్షేత్రములపైని ప్రబంధముల వంటి పెద్దకీర్తనలను వ్రాసెను. నవగ్రహములపైని నవరత్నములను వ్రాసెను. క్షేత్రయ్య విజయరాఘవ పంచరత్నములు, త్యాగయ్య ఘనరాగపంచకం, స్వాతితిరునాళ్ల మణిప్రవాళ,

కీర్తనలనుబోలిన ముద్దుస్వామి నవగ్రహానవావరణకృతులను వ్రాసెను. ఇతని నవగ్రహకీర్తనలలో జ్యోతిశ్శాస్త్రప్రవీణత తెల్లమగును. నీలోత్పలాంబిక, మీనాక్షీదేవిపైని కృతులను వ్రాసెను. అవి గీర్వాణభాషలో ఉదాత్తములైన స్తోత్రి వాఙ్మయమునకు చేరినవి. ఇవి యితని మంత్రిశాస్త్ర యోగ శాస్త్ర పరిజ్ఞానమును బోధించుచున్నవి.

ఇతనిసోదరులైన చిన్నస్వామి బాలస్వాము లితని కీర్తనలను రాజాస్థానములలో పాడి ప్రచారముచేయఁదొడం గిరి. వీరు మధుర కాహ్వానింపబడి యచ్చటనే జీవయాత్రను సాగించుచుండగా చిన్నస్వామి చనిపోయెను. భ్రాతృవియోగ మును భరింపలేక తనశిష్యుఁడగు హరితో బాలస్వామి రామే శ్వరయాత్రకు బోయెను. తిరుగుదలలో ఎట్టియాపురరాజ సందర్శనముకాగా వారు ముద్దుస్వామివారి కృతులను విని సంతసించి యితనిని తమ ఆస్థాన విద్వాంసునిగా నిల్పివేసిరి. ఈవృత్తాంతమెల్ల ముద్దుస్వామి కవగతముకాగా "సుఖదుఖే సమాకృత్వా" యన్నటుల యోగివర్యుఁడగు నాయన మనసు నెంత దిట్టపరుచుకొన్నను బాలస్వామి సంగతిని చూడవలె నను కోర్కె బొడమెను.

సాతూరునకు భార్యాద్వయముతోడను శిష్యుడు తేవూరు సుబ్రహ్మణ్యంతోను కలసి పయనించి ఆవూరి దేవా లయములో అర్చన జేయుచుండెను. అప్పుడక్కడి వైష్ణవ బాలురు బాలుస్వామి వివాహప్రసంగము నతనికిదెల్పి ఎట్టి

యాపురమునకు పయనముగా బుత్తెంచిరి. వెంటనే ఆ బాలకుల సహాయముతో పోవుచుండగా ప్రక్కగ్రామములలోని పైరులు వర్షాధారము లేక మాడిపోవుటను చూచి ఖిన్నుడై అమృతేశ్వరుని ధ్యానించి అమృతవర్షిణిరాగంలో "ఆనందామృతకర్షిణి వర్షిణి" అని పాడిరి. వెంటనే కారుమబ్బులు గ్రమ్మి మునలధారగా వర్షము కురిసెను. ఇతడు ఎట్టియాపురమును జేరి రాజదర్బారులో కీర్తనలను పాడగా దొరగారితనిని తన ఆస్థానములోనుండమనికోరిరి. కాని నిర్లిప్తుడైన దీక్షితులు రాచసన్మానములకు మురియక ఎప్పటివలె తిరువయ్యారున కేగి శిష్యగణమునకు పాఠములను చెప్పదొడంగెను.

ఒకొకతరి శివలూరిలోని స్వామిదర్శనమునకు పోగా అచ్చటి పూజారులాలయకవాటములను బంధించిరి. అంతట నిశ్చలచిత్తముతో శంకరాభరణ రాగములో "అక్షయలింగ విభో" అను కీర్తనను ఆశువుగా చెప్పి పాడుచుండగా కవాటములు విడివడెను.

ఇతనికి శామశాస్త్రి త్యాగయ్యలపైని భక్తిభావము లుండెను. గనుక వారికృతులను విని ఆనందించెను. త్యాగయ్యయింట జరిగిన శ్రీరామపట్టాభిషేక సందర్భమున మణిరంగురాగంలో "మామవపట్టాభిరామ" అను కీర్తనను రచించెను. ఇతనికి పుత్రసంతానము లేనికారణమున సుబ్బరామదీక్షితులను దత్తత జేసుకొనెను.

శిష్యులు:వడివేలు పొన్నయ్య చిన్నయ్య శివానందం సోదరులు గురుస్తుతిపరముగా తొమ్మిదికీర్తనలను వ్రాసిరి.

నిర్యాణం : 1835 . యువరాజుపెండ్లికి రావలెనని ఎట్టియాపురంరాజు ప్రార్థింపగా తన కవసానదశ సమీపించె నని తెలుసుకొని ముద్దుస్వామి శిష్యులసెలవునుగైకొని రాచ సభ కేగెను.

ఆనాడు దీపావళిపండుగ. పురమంతా మంగళతోరణ ములతో నలంకరింపబడెను. రాజుగారి పట్టపుటేనుగు మద మెక్కి రుద్రభూమికి పోయి ఆకసమువంక తొండమునుచాపి ఘీంకారనాదము చేయగా రాజేదో గొప్పవిపత్తురానున్నదని దీక్షితులవారికి విన్నవించెను. అది మన్మథసంవత్సరం. దీక్షి తులవారి షష్టిపూర్తి సమీపించినది. వీరు సమాధినిష్ఠలో అర్చన గావించుచుండిరి. విప్రులు వేదపఠనమును, శిష్యులు గానమును జేయుచుండగా దీక్షితులవారు కన్నువిప్పి 'మీనాక్షిముదం' అన్నారు. ఇది వీరికి ప్రేమాస్పదమైన కృతి. శిష్యులు అనుపల్లవిని తీసుకొని 'మీనలోచనీ పాప మోచనీ' అని పాడగానే దీక్షితులవారి శిరముపగిలి ప్రాణ మును విడిచిరి. రాజును ప్రజలు దుఃఖితులైరి.

శిష్యవర్గం:— ఇతని శిష్యులలో నట్టువగులు నాగస్వర వాద్యకులు గాత్రజ్ఞులు మార్దంగికులు వైణికులుగా అనేక తరగతులవారు గలరు. భక్తులై కొందరు గానవాఙ్మయ నిర్మాతలుగా విలసిల్లిరి. 1. శుద్ధమద్దెల తంబియప్ప, 2. తిరు

క్కుడయూర్ భారతి, 3. అవడయార్ వీణ వెంకట్రామయ్య, 4. తేవూరు సుబ్రహ్మణ్యం, 5. కోర్నాడ రామస్వామి, 6. అయ్యస్వామి, 7. బిల్వవనం, 8. వడివేలు, 9. చిన్నయ్య, 10. పొన్నయ్య, 11. శివానందం, 12. నర్తకి అమ్మాణి, 13. కమలం.

తంబియప్ప : శ్రుతిపర్వమైన మద్దెలగాడు కాన ఇతనికి 'శుద్ధమద్దెల' అను బిరుదం గలదు. మహావైద్య నాథయ్యరు 'చింతయామి కందమూలకందం' అను కీర్తనను పాడుచుండగా సరిగా లేదని ఆక్షేపించెనట.

భారతి, వెంకట్రామయ్య, సుబ్రహ్మణ్యం ముగ్గురు గురువులతో కలిసి క్షేత్రయాత్ర చేసిరి.

రామస్వామి : భరతశాస్త్రమును లక్ష్యలక్షణో పేతముగా నభ్యసించి సంగీత మార్గదర్శకుడయ్యెను.

బిల్వవనం : నాగస్వర వాద్యప్రవీణుడు.

అయ్యస్వామి : తానవర్ణ, పదవర్ణ రచయిత.

పొన్నయ్య : భరత విద్యాప్రవీణుడు. పిడలరు. గురుభక్తిని వెల్లడించుటకు భిన్నషడ్జ రాగంలో గురుగుహ మూర్తికి శిష్యుడ నని వ్రాసెను. స్వరజతులు, పదవర్ణాలు రచించుటలో నిపుణుడు.

కమల : గాననాట్యములలో ప్రతిభావంతురాలు. తన ఆభరణముల నమ్మి గురువులవారి ఆర్థిక కష్టముల

బాపిన విదుషీమణి. దీక్షితులు అమరజీవి. సన్మార్గుడు, విరాగి, ముముక్షువు. అద్వైతియై సోహత్వము నొందెను. ఇతని మధుర వాక్కులు, గేయకల్పనలు, రాగవిన్యాసం, ఆత్మతత్వం యితని కీర్తనలలో స్థిరత్వము దాల్చినవి. నాదోపాసనద్వారా త్యాగయ్య భక్తి ప్రబోధమును అనన్య సామాన్య ప్రతిభతో ముద్దుస్వామి రాగమును గమకాది లక్షణ సమన్వితమొనర్చి లక్షణజ్ఞుడయ్యెను. తాళగతులచే రాగవిన్యాసక్రమమును బోషించి లక్షణయుక్త గానమును శామయ్య నిర్మించెను. వివిధమార్గములలో గానవిద్యను వీరు పోషించినా వీరి సందేశ మొక్కటియే. వీరికి గానము ఆముష్మికసాధనంగా బరగి గానవిద్యా ప్రపంచములో నూతన శకకర్తలుగా రాజిల్లిరి.

## మలబారు రాజగాయకులు.

తిరువాన్కూర్‌లో ప్రాచీన ద్రవిడ గానపద్ధతి పేరు సోపానం. ఇది ఆర్యసంగీతముతో బాటు ప్రచారములో నుండెను. పాటలు, పదాలు, కథకళి నృత్యంలోను, 'పట్టు' అను జాతీయగీతములలోను, ఉంజాల్, తుల్లాల్, వంజి, తిరువత్తిర, భద్రకాళి గీతములలో విరివిగా వాడబడెను. చాలా ద్రావిడరాగములు, పది, ఇందాళ, ఇందాళం, పురాణి, కన్న కురంజి యను వ్యవహారనామములలో నున్నవి. తేవారభక్తి గీతాలలో 20 రాగాలు వాడబడెను. అవి నాటపద్దై – నాట

రాగం, పజంపంజరం–శంకరాభరణం, సాధారి–పంతువరాళి, కౌశిక్–భైరవి అనుపేర్లతో 11వ శతాబ్దములో వాడబడెను. ఆర్యుల వీణకు సరియైన (Yazh) యాళి అను ఒక తంతీ్రి వాద్యమున్నది. తమిళభాషలో సప్తస్వరాలపేర్లు. స–కురల్, రి–తుట్టం, గ–కైకలై, మ–ఉజాయ్, ప–ఈశైం, ధ–విలారి, ని–తారం. ఆర్యులగమక చిహ్నములు ద్రవిడ సంగీతానికి ఉత్తేజమిచ్చెననుట సంభావితం. తిరువాన్కూర్లోని ద్రవిడ గాన మార్యసంపర్కముచే కలుషితమైనదని నిరూపించడానికి విచారగీతము,లు దీర్ఘపుచుట్లు, తిరువాంకూర్ సంగీతంలో విదితం. 18 వ శతాబ్దిలోని కార్తిక తిరునాళ్, అస్వాతి తిరునాళ్ రాజు లీ శైలిలో గీతాలు రచించిరి. క్రమంగా త్యాగయ్య – దీక్షితులవారి కృతులు తిరువాన్కూర్లో క్రొత్త గానాభిరుచిని కలుగజేసెను.

అస్వాతి తిరునాళ్రాజా (1756–88) : సంస్కృత భాషాకోవిదుడు. గాన యితడు రచించిన కీర్తనలు నేటికినీ పద్మనాభస్వామి దేవాలయములో పాడబడుచున్నవి. నేటి మలబార్ సంగీతానికి ప్రారంభదశ యిది. గోవిందమరాక్ తరుచు అష్టపదులను పాడేవాడు.

రాణీ రుక్మిణీబాయి (1800–37) . స్వాతి తిరునాళ్ల సోదరియైన యీాపె తన గీతాలలో శాంతి నుపాదించి, భావ గర్భితముగను శ్రావ్యముగను జేసెను.

స్వాతి తిరునాళ్లు (1827–47) : వీరు త్యాగరాజ సమకాలీనులు, గానవిద్యాకుశలురు, కళాపోషకులు. వైష్ణవ రాజభక్తులలో నొకరైన కులశేఖరాళ్వార్ వంశానికి చెందిన ఆళ్వారులలో స్థానమును గ్రహించిరి. ఇతడు రాజులలో గాన సమ్రాట్, సమ్రాట్టులలో గానచక్రవర్తి అయి యొప్పెను. ఈ ఘనత యీ రాజవంశానికే చెల్లినది. ఇతని దర్బారు అసంఖ్యాక సంగీత శేముషీ ధురంధరులతో ప్రకాశించెను. ఇతడు బహుభాషావేత్తయై 12 భాషలలో సమగ్రపాండిత్యం సంపాదించెను.

ఇతడారుభాషలలో కృతులు, వర్ణాలు, పదాలు, తిల్లానాలు రచించెను. కీర్తనలలో భాగవతసారమును వర్ణించెను. పురాణస్థలములలో నొకటైన స్యాందపురమను దాని మహాత్మ్యమును కుశలతతో వ్రాసెను. ఇతని కృతుల విశిష్టత యేమనగా స్వరాక్షరములను (స, రి, గ, మ) సముచితంగా యిమిడ్చెను. చాలా కృతులలో అర్థభావం చెడలేదు. ప్రారంభవిద్య కనువగునట్లు సరళీశైలిలో కొన్నింటిని వ్రాసెను. మరికొన్ని కీర్తనలు వర్ణములు నాతిదీర్ఘములై సంగీతశాస్త్రజ్ఞుల గాత్రపటిమను శోధించుటకో యన్నట్లు కఠినశైలిలో నున్నవి. ఇతడు భక్తి ప్రధానమగు గీతములను సోపానపద్ధతిలో మృదుమధురశైలిలో వ్రాసెను. ఈ రెండు తరగతుల పద్ధతులలోని లోపాలను సవరించి ఆర్యద్రావిడ గానములనిసుమిళితము జేసెను. ఛాసర్ అను ఇంగ్లీషుకవిలోని

సులభశైలి శ్రావ్యత యితని భణతులలోనున్నది. ఇవి పల్లెటూరి పదాలను స్ఫురింపజేస్తవి. వీరి కీర్తనలలోని రసస్ఫూర్తి చాలా ఉత్కృష్టం. భాషాపాండిత్యం నిరుపమానం. ఇతని ఆస్థానగాయకుడగు పరమేశ్వరభాగవతార్ కఠినమగు స్వర కల్పన చేయగా దాని కనుగుణ్యమగు శబ్దములను కూర్చి గీతముల నల్లెను.



ఇతని స్వల్ప ఆయుఃపరిమాణంలో ఇతడు వివిధ తరగతుల కీర్తనలను రచించెను. వీరి ఉత్సవ సంప్రదాయ కీర్తనలు నేటికినీ దసరా పండుగలలో పాడుచున్నారు. రాజ వంశములో వైష్ణవభక్తుల శ్రేణి నలంకరించిన వా డితడొక్కడే. ఇంతేగాక నృత్యం, కథకళిలో గూడా యితనికి ప్రవీణత కలదు. హిందుస్థానీ గానాభివృద్ధికి ఉత్తరదేశమునుండి

హాలావతి, సులేమాన్ సాహెబులను రప్పించెను. ఇతడాగర్భ శ్రీమంతుడై 'శాక్తరాజా' యని పిలువబడేవాడు. తన కీర్తనలను విమర్శించుట కితడు త్యాగయ్యకు పంపించెడివాడట. అనంతపద్మనాభుడే కులదైవమని పూజించునట్లు శాసించి ప్రజలకు నమ్మికను గలుగజేయుటచే 'పద్మనాభదాస వంచిపాల' యను బిరుదాంకితు డయ్యెను.

రచనావిశిష్టత : శ్రావ్యత, మాధుర్యం, భావగర్భితం యితని కీర్తనల వైశిష్ట్యం. ఇతని కృతులలోని మనోహరత్వం మనోభావములను సందర్భానుసారమగు పదముల కూర్పుచే చాటుచున్నది. పద్మనాభస్వామి కంకితములగు కృతులు భక్తిరసపూరితమగు నుత్కృష్టశైలిలో వ్రాయబడినవి. ఇతని హిందూస్థానీ కృతులు తాన్‌సేన్, సదారంగ్ వంటి ఉత్తమగాయకుల కృతులను మరపింపజేయును.

ఆస్థానవిద్వాంసులు : కోకిలకంఠ మేరుస్వామి, పరమేశ్వర భాగవతార్, చింతామణిరావు, చోళవరపు రఘునాధరావు, సారంగపిళ్ళై, తోడి రాఘవయ్య, గోవిందమరార్, లక్ష్మణగోసాయి, కోయిల్ తంబిరాన్, ఇరవన్‌తంపి, కన్నయ్య, హరిరావు, దివాన్ సుబ్బారావు, శివరామగురుదాస్, రామయ్యంగారు, వడివేలు, పొన్నయ్య, హాలావతి, సులేమాన్ సాహెబు.

పరమేశ్వర భాగవతార్ : గొప్ప విద్వాంసుడు. తిరువాన్‌కూర్ గాయకులలో అగ్రగణ్యుడై వెలసి 77 ఏండ్లు

జీవించెను. తిరువాన్‌కూర్ సంగీత ప్రారంభ, చరమ దశలను జూచెను. ఇతని కీర్తనలు క్లిష్టమగుటచే పాటకులకు శ్రమ గలుగ జేయును.

గోవింద మరార్ : మువ్వాత్తుపురం తాలూకా రామ మంగళం నివాసి. షట్కాల పల్లవి ప్రవీణుడగుటచే ఇతనికి 'షట్కాల మరార్' అను బిరుదము వచ్చెను. 1831 సంవత్సరములో పరదేశమునుండి తిరువాన్‌కూరునకు వచ్చి నివాసము చేసికొన్న వారిలో ప్రథముడు. తొలుత పరమేశ్వర్ భాగవతార్‌తో యితనికి పరిచయం కల్గెను. ఇతడొక చేతిలో మంజీరమును, వేరొక చేతిలో సప్తతంత్రీతంబురను ధరించి దేశాటనకు పోవుచుండగా మార్గమధ్యమున పండరీపుర క్షేత్రములో దేహమును చాలించెను. ఇప్పటికీ యితని తంబుర ఆ దేవళములో గలదని ప్రతీతి. 1843 సంవత్సరంలో తిరువయ్యారున కేగి త్యాగరాజును దర్శించి అతని సన్నిధిని తన పాండిత్యమును ప్రకటించి 'గోవిందదాస్' బిరుదమును బొందెను. దీనికి దృష్టాంతముగా త్యాగయ్య "ఎందరో మహానుభావులు" అన్న కీర్తనను యితనికి సంబోధనగా రచించెను. మరార్ సహజంగా స్వతంత్రుడును, ధనాశలేని వాడు నగుటచే ఖ్యాతికొరకే పెనగులాడెను. అందుచే స్వస్థానమును విడిచి దూరదేశమున కేగి పేరును సంపాదించి అసువులను గోల్పోయెను.

కృష్ణమరార్ : అసమాన ప్రతిభతో వర్ణాలు, కృతులు, పల్లవులు పాడగల మేధావి. సప్తస్వరములను బల్కింపగలిగి కృతులను వాయించుట కనువైన 'ఎడక్క' అను చర్మవాద్యమును ధరించి సదా పాడుచుండెను. ఇతని సామర్థ్యమును ప్రకటించు చిహ్నముగా తంబురకు ఒక ధ్వజము నలంకరించెను. రా జితనిని స్వర్ణకంకణ విభూషితుని గావించెను.

మేరుస్వామి (1833–70) : తంజావూరు నుండి వచ్చిన మహారాష్ట్ర బ్రాహ్మణ గాయకుడు. కోకిలవంటి శ్రావ్యధ్వని గలవాడగుటచే యితనికి రాజా "కోకిలకంఠ" బిరుదమును యిచ్చి ఇతని చిత్రమును స్వాతితిరునాళ్ భోజన శాలలో వ్రేలాడగట్టించెను. రాజాశ్రయములో 1833 లగాయతు 1870 సం॥రం వరకూ వుండి నెలకు నూరురూపాయిల వేతనమును తీసెను. ఇతడు కథకుడు.

లక్ష్మణగోసాయి : 1860 లో అయిళ్యం తిరునాళ్ళితనిని దర్బారు గాయకుని జేసెను. ఇతడు మేరుస్వామికి ప్రతికక్షుడు. 'మహా మేరుస్వామి' బిరుదమును పొందెను. నాల్గు స్థాయిలలో అవలీలగా పాడగల్గు సామర్థ్యం గలవాడు.

వడివేలు : తిరువాన్కూర్ ఆస్థానగాయకుడు. ఇతడు గోవింద్ మరార్ను త్యాగరాయలవారి సందర్శనము చేయించి వారిని తిరువాన్కూరు దర్బారు కాహ్వానింపగా వారు తిరస్కరించిరి. ఇతని తాన వర్ణములు అనన్య ప్రతిభా

వంతములై రాణించుచున్నవి. తిరువాన్కూరు ఆస్థానంలో మొదట ఫిడేలును ప్రవేశపెట్టిన ఖ్యాతి యితనికి వచ్చెను. దేహచ్ఛాయ నలుపు. మెల్లకన్ను గలిగి బక్కగానుండెను. అప్పటి గాయకులలో శ్రావ్యమగు కంఠము గలవాడై చెన్నారెను. హరిపదక్షేత్రములో పాడుటకు కీర్తనలను వ్రాసెను. ఇతని వర్ణాలు సుప్రసిద్ధము. రాజు ఇతనికి దంతపు ఫిడేలు నిచ్చి సన్మానించెను.

శివరాంగురుదాస్ ఉరఫ్ క్షీరాబ్ధిశాస్త్రి : వేదాంత ప్రతిపాదితములైన గీతములను పెక్కింటిని రచించెను. గొప్ప మంత్రవేత్త.

ఇర్వన్వర్మ తంపి (1783–1856): స్వాతి తిరునాళ్ బంధుకోటిలోని వాడైన యితడు గొప్పకవి. ఇతడు 500 గీతములను రచించి కొన్నింటిని స్వాతి తిరునాళ్ళకు విమర్శకు పంపుచుండెను. ఇతడు స్వాతి తిరునాళ్తో సమాన ప్రతిపత్తిగల కవి. ఇతని కూతురు కుట్టికుంజ తంగాచి కూడా కవయిత్రియే. ఈమె మనుమడైన పద్మనాభతంపి గొప్ప చిత్రకారుడు. స్వాతి తిరునాళ్ళు 1847 సం॥రంలో భౌతికశరీరమును త్యజించి కైవల్యధామము జేరెను.

నారుమంచి జానకిరామయ్య క్రీ.శ. (1823-1902):

ఆంధ్రదేశములో నారుమంచివారి కుటుంబం, గాన సంప్రదాయానికి ప్రసిద్ధికెక్కినది. శ్రీజానకిరామయ్య పూర్వీకుల గానప్రశస్తికి అనేకమాన్యాలు బహుమతియివ్వబడినవి.

జానకిరామయ్య 1823 సం॥రంలో జన్మించిరి. తన పదునెనిమిదవ యేటను తంజాపూరులో శ్రీ త్యాగరాజును దర్శించి గానాభ్యాసమునకు వారినాశ్రయింపగా వారు తమ శిష్యులైన వీణ కుప్పన్న యొద్దకుబోయి గానమభ్యసింపమనిరి. ఇతడు కుప్పయ్య నాశ్రయించి పదునాలుగేండ్లు అహర్నిశాదులు పాటుపడి 300 గీతాలు, 100 వర్ణాలు, 100 కీర్తనలు పాఠముజేసి పల్లవిపాడుటలో ప్రావీణ్యమును సంపాదించిరి. 1855 సం॥రంలో స్వగ్రామంజేరి కొంతకాలంజరిగిన తర్వాత చెన్నపురి కేగి కుప్పయ్యవద్దను తిరిగి రెండేండ్లుండి పిమ్మట దక్షిణాదిని అనేక కచేరీలు చేసివుండిరి. ఆంధ్రదేశములో చోళదేశపు కర్నాటక గానబాణీని, గుంటూరుసీమలో తొలుదొల్త ప్రవేశపెట్టి ధన్యులైరి. ఇతని పాట నాదభూయిష్టమై, భావప్రధానముగనుండి సకలలక్షణసమన్వితమై ఆదర్శప్రాయమై యొప్పారెను. శ్రీత్యాగరాజస్వామి యూరేగింపు టుత్సవాలలో కీర్తనలు, తరంగాలు, మైమరచి పాడెడివాడు. ఇతడెన్నడూ ఫిడేలును ప్రక్కవాద్యంగా పెట్టుకొనలేదు. ఇతను కోట్లనల్లూరు, చల్లపల్లి, ఉల్లిపాలెం, నర్సరావుపేట జమీందార్లచే ఆహ్వానింపబడి సత్కరింపబడెను. ఇతని ప్రముఖశిష్యులు: నారుమంచి సీతారామయ్య, ఉప్పటూరి శ్రీరాములు, జవంగుల శ్రీహరి, రాఘవులు, శ్రీమతి రాంబాయి, రంగనాయకి, చిన్నమ్మ మున్నగు పల్లవప్రవీణులు.

నారుమంచి చినసీతారామయ్య (1877 – 1943) : జానకిరామయ్యగారి శిష్యులు. పెదరావూరు గ్రామం నివాసం. 14 వత్సరాలు. అనేక దేహశ్రమలకోర్చి గురుశుశ్రూషనుజేసి విద్యనుసాధించిరి. బాసిసలవగిది అంతేవాసులాచార్యులను సేవించుచుండిరి. 100 వర్ణాలు, 100 కీర్తనలు, 200 లక్షణగీతాలు, అనేక స్వరజతులూ వల్లించిరి. పల్లవికి పునాది వర్ణపాఠం. జానకిరామయ్య తనశిష్యులగు ఉప్పలపాటి శ్రీరాములు, సీతారామయ్యగార్లను తమగురువు వీణ కుప్పయ్య పుత్రులు ముత్యాలపేట త్యాగయ్యవద్దకు పంపిరి. అచ్చట 2 సం॥రములుండి కొన్నివర్ణాలు, కీర్తనలు పాఠం చేశారు. వృద్ధవిద్వాంసుల బాణీని మార్చి నూత్న శైలిలో పాడినవారు వీరొకరు. అది వారిప్రత్యేకత. వర్ణం పాడడంలో వారికి పెట్టినదిపేరు. నాదాన్ని పూరించి విలంబ కాలంలో, ఆర్తిలో, భావప్రధాన గమకయుక్తంగా పాడిన వారిలో వీరు ఆరితేరిన ధీరులు. వర్ణం, స్వరకల్పన వీరి ప్రత్యేకతగా నుండెను. స్వరప్రస్తారం రాగభావపూరితమై గజగమనాన్ని బోలివుంటుంది. ఎన్నడూ ఎవ్వరినీ ఆశ్రయించి యెరుగని స్వతంత్రజీవనులు. ఉదారస్వభావులు, సహనశీలులు పరోపకారపారీణులు. అనేకమంది దక్షిణాత్యుల కచేరీలు ఏర్పాటుజేసిరి. గానశిక్షణలో సమర్థులు. శిష్యులకు చాలా కట్టుదిట్టములు విధించుటచే వీరినెవ్వరూ ఆశ్రయించలేదు. సుమారు వీరివద్ద సంగీతపాఠం పూర్తిగావించడానికి 10 సం॥

రాలు పట్టుతుంది. సంగీతసాధనలో పట్టుదల, దీక్షగలవారిలో శెమ్మంగుడి, చౌడయ్య రోజుకి 10 గంటలు సాధనచేసిరట. సీతారామయ్య గురువువద్ద అహర్నిశాదులు 14 ఏండ్లు సాధకం జేసెను. ఇతని వర్ణం, స్వరప్రస్తారం మెచ్చి, తిరుమల స్వామి అయ్యంగారు వీరికి ఖరీదైన తంబురాను బహూకరించిరి. వీరి కుమారులు సాంబశివరావు బి. యే. బి. యిడి., కూడ మంచి గాత్రజ్ఞులు.

## ఆధునిక ఆంధ్ర గాత్రజ్ఞులు

పక్కా హనుమంతాచారి (1849 – 1939) : ఇతడు పంచకావ్యములను ముగించిన పిమ్మట కరూర్ వెళ్ళి అచ్చట కరూర్ రామస్వామి వద్దను శుశ్రూషజేసి గానము నభ్యసించెను. అప్పటికి శ్రీమతి కోయంబత్తూరు తాయి, పల్లడం సంజీవరావుగార్లు విద్యాభ్యాసమునకు జేరిరట. తాయి వీరి పాఠమును విని గానాభ్యాసం చేసెడిదట. ఆమెయే వీరి వివాహపు ఖర్చులు భరించెనట. ఇతనిది సభారంజకమైన శారీరం. ఇతని శిష్యులు చింతలపల్లి వెంకట్రావు, రామచంద్రరావు ప్రభృతులు. 1939లో వీరు దివంగతులైరి.

చింతలపల్లి వెంకట్రావు : అసాధారణమైన రక్తి గాత్రము కంచుమోగినట్లు మోగెడిది. చక్కని బాణీ. లయదిట్టరి. భావగాంభీర్యం రాగరసమును చిమ్ముతూ రాణించెడిది. నెక్కార్పట్టు శేషన్నవద్ద గానవిద్య నతిశయింపజేసుకొనెను. అసాధారణ కల్పనాచిత్ర ధురీణుడు. శరపరం

పరగా అపూర్వ తాళాలలో పాడగల ప్రతిభాశాలి. సర్వలఘు స్వరాలలో దిట్ట. పాండిత్యప్రకర్ష, సాధనాపటిమలు పండిత పామరులను చకితులను జేసేవి. ఇతని రెండో గురువు తిరువయ్యారు సుబ్రహ్మణ్యం. ఇతని కచేరీలు రాయలసీమ కావర్ణ్య ప్రియములు. 1944 లో నిర్యాణం చెందెను.

కురుగోడు వేంకటాచలం : కర్నూలునివాసి. నామకల్లు నరసింహాయ్యంగారి శిష్యుడు. కల్పనావైచిత్ర్యం, స్వరఅల్లిక జిగిబిగి అమేయంగా గలవాడు. ఇతనితమ్ముడు వెంకటనర్సయ్య మంచిఫిడలరు.

చలమత్తూరు రామయ్య : పక్కా హనుమంతాచారి శిష్యుడు, శ్రీవిద్యోపాసకుడు. హఠయోగ నిపుణుడు. మంచి ఫిడలరు. అలంకారాలు షట్కాలాలలోను వర్ణాలను త్రికాలాలలోను సాధన జేసి గమకబద్ధంగా పాడేవాడు. పావు అర్థ జాగా విడిచి వర్ణ సాధనం చేసెను. గతిభేద రహస్యాలు తెలిసినవాడు. రాగప్రస్తారంలో నిపుణుడు. నాటకురంజి, సురట, వసంత, శహన రాగాలను విస్తరించి విసుగు పుట్టకుండా పాడే ధీశాలి. హిందూపురం నివాసం.

ఆమదాల వెంకటస్వామి : అనంతపురం నివాసి. ఫిడేలు పక్కవాద్యంగా వాయించేవాడు. గుండాసాని యితని శిష్యురాలు. పదాలు పాడుటలో ప్రవీణులు.

ఫిడేలు రాఘవేంద్రాచారి : బళ్లారి నివాసి. గానరసిక బృంద నిర్మాత. ఇతని బోధనాశక్తి నిరుపమానం. ప్రక్క

వాద్యంలో విశిష్టత గలవాడు. అనేక వాయిద్యాలలో ప్రసి ద్ధుడు. ఇతని శిష్యులు నరసింహాచారి, భీమసేనాచారి.

## ఒంగోలు సీమ

ధేనుకొండ చిన్నయ్య.నివాసంఅద్దంకి. 1869–1929 ఒంగోలు తాలూకా గార్లపాడు గ్రామములో ధేనుకొండ పిచ్చయ్యగారికి ఆర్వేలనియోగి వంశంలో 1869 సం॥రంలో జన్మించెను. పిచ్చయ్య కేవల నృసింహోపాసకు డగుటయే గాక పారిజాతాపహరణ, వామనచరిత్ర, యక్షగానాలను రచించెను. నిరతాన్నప్రదాత. శ్రీరామ నరసింహోత్సవాలు జరుపుచుండెను.

శ్రీచిన్నయ్య 14 వ ఏటను నెల్లూరు జేరి అచ్చట నుండి మదరాసు జేరెను. తనకన్న ముందే రామకూరు వాస్తవ్యుడగు పరమాత్మని నారాయణ, తచ్చూరి పెద సింగరాచార్యుల వద్దను గానము నభ్యసించుటను విని, ఆచార్యులవారి నాశ్రయించి వర్ణాంతం పాఠమును పూర్తి జేసెను. పిమ్మట విద్యాభివృద్ధికి వీరిద్వరు తిరువయ్యారు జేరి పట్నం సుబ్రహ్మణ్యం వద్ద రెండు సంవత్సరము లుండిరి. తర్వాత ఉమయాల్పురమున కేగి మహావైద్యనాథన్ శిష్యు డైన స్వామినాథయ్యరు వద్ద 6 సంవత్సరములబాటు గానము నభ్యసించిరి. స్వామినాథయ్యరు వీరికి కచేరీచేయఁగల సామ ర్థ్యతను గల్గజేసెను. వైద్యనాథయ్యరు 72 మేళకర్తలను వీరు

వల్లించిరి. గురువుగారి అనుజ్ఞచే మహావైద్యనాథయ్యరువద్ద రెండుసంవత్సరాలలో గానరహస్యాల నెరిగి గృహోన్ముఖులై వచ్చుచూ చెన్నపురిలో గానసభను జేసి ప్రాజ్ఞుల మన్ననలను బడసి స్వస్థానమును జేరిరి. పరమాత్ముని నారాయణ విద్యావినయసంపన్నుడు. రంజకగాత్రజ్ఞుడు. అనతి కాలములోనే మృతిజెందెను. చిన్నయ్య కొత్తపల్లిలో వివాహమాడి తన విద్యాచతురతను కచేరీలలో నేమి విద్యా బోధనలో నేమి ప్రదర్శించుచు, విద్వాంసుల పొగడ్తలను బొందెను. విద్యార్థులకు లక్ష్యలక్షణములలో విద్యను నేర్పెను. ఒంగోలుసీమ పరిసర గ్రామాలలో బుద్దాం, పరచూరు, కావలి, ధేనుకొండ గ్రామాలలో అనేక పాఠశాలలను నెలకొల్పి అనేకులకు విద్యాదానమును జేసెను.

ఇతని శిష్యులు : రామాయణం సీతాపతి, కుందుర్తి రామమూర్తి, ఫణిహారం వెంకటసుబ్బయ్య, ములుకుదురు వెంకటకృష్ణయ్య, పోతుమర్రి కృష్ణయ్య, పరమాత్ముని సుబ్బయ్య, పమిడిఘంటం సుబ్బయ్య, ఓగిరాల రామ్మూర్తి, ఓరుగంటి వరదయ్య, పరిమి భద్రయ్య, దాసరి రత్నం, గంధం మురహరి, షేక్ నబీ ముగలాయి, భూసురపల్లి రత్నం, చదలవాడ అచ్చయ్య, రావినూతుల వరదయ్య, అమ్మన బ్రోలు దాసు, విస్సా రామారావు, ఇతని కొడుకు సుబ్బారావుగార్లు. పెదపూడిలో వీరి విద్యానైపుణ్యాన్ని మెచ్చి

సింహతలాటపు ముగుగుల జతచే బహూకరించిరి. గద్వాలు, మైసూరు, తిరువాన్‌కూర్, వెంకటగిరి సంస్థానాలలో గౌర వింపబడి 'లయబ్రహ్మ' బిరుదాన్ని బొందెను. ఇతని స్వర కల్పనా చాతుర్యం ప్రశంసనీయం. స్వరము ననర్గళముగా నల్లగల సమర్థుడు. పల్లవిప్రస్తరణప్రవీణుడు. సంగీతశాస్త్రం కరతలామలకంగా గలవాడు. ఇతని సోదరుడు వేంకయామా త్యుడు యక్షగాన కవిధురంధరుడు. యతి ఆశ్రమాన్ని స్వీకరించి సిద్ధుడై తాడిపత్రిలో పరమపదించెను.

శ్రీరంగభట్టర్ వద్ద ఉపదేశాన్ని స్వీకరించి విశిష్టా ద్వైతమత చక్రాంకితుడై 1929 లో యశఃకాయమును బొందెను.

సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి (1860 – 1917) : గానవిద్యా గురుకులపతి బిరుదాంకితుడు. కృష్ణాతీరస్థమగు పెదకళ్ళేపల్లిలో రౌద్రిసంవత్సర ఆషాఢశుద్ధ త్రయోదశి రోజున గంగాధరశాస్త్రిగారికి జన్మించెను.

పరమేశ్వరుని శక్తిసామర్థ్యాలొక్కొక కాలంలో కొందరి మహానుభావుల ద్వారా ప్రస్ఫుటితమగుచుండును. అట్టివారినే "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా" "తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవః" అను గీతావాక్యములనుబట్టి గాయకులను భగవదంశసంభూతు లుగా లెక్కించుచున్నారు.

ఇతడు గానవిద్యలో నుత్తీర్ణుడగుటకు సంస్కృతాధ్య యము నవసరముగా నెంచి, వ్యాకరణ, మీమాంస, ఛందో, ఉపనిషత్కావ్యాలను బఠించెను.

సంగీతసాధనచే మోక్షమును సులభముగ బడయ వచ్చునని తలచి తంజావూరు చెంతనున్న పంచనదక్షేత్రా నికిబోయి "సత్సంప్రదాయస్థం శ్రద్ధావంతం సత్కులభవం శ్రోత్రియం శాస్త్రవత్సలం గుణవంతం అకుటిలం సద్గురు మాపాద్యం" అని శ్రుతులు వచించుటచే "తద్విజ్ఞానార్థం సద్గురు మేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుత్యనుసారం సద్గురునాశ్రియంచే జ్ఞానోపార్జన బడయ వలెనను కుతూహలంతో అచ్చటి గానవాగ్గేయకారక వరి ష్ఠులైన ఆకుమళ్ళ వేంకటసుబ్బయ్య వద్ద, వారిశిష్యులైన వీణా ధర్మదీక్షితర్ వద్దను గురుకులావాసం జేసి గానము నభ్యసించెను. గురువులవద్ద కొంతలక్షణ గ్రంథమును కొన్ని గీత వర్ణ కీర్తనాదులను సంగ్రహించి, స్వదేశానికి తరలి వచ్చెను. వానిలో గొన్ని పైడాల గురుమూర్తిశాస్త్రి 72 మేళకర్తలలోని లక్షణగీతాలు, ప్రబంధాలు, కొన్ని ఘన రాగగీతాలు, తానవర్ణాలు, కీర్తనలు మాత్రకాలపద్ధతి ననుస రించి స్వరపరచి వ్రాసెను.

'శిక్షాకారనుకారశ్చ రసికో రంజకస్తథా। భావు కశ్చేతి గీతజ్ఞాః పంచధా గాయనం జగుః॥ సం. రత్నాకరం దీనినిబట్టి తన్మయుడై పాడి మెప్పించిన లక్ష్యలక్షణసమన్వి

తుడైన నాదోపాసకుడు, రసికుడు. ఉ॥ కోనేరిరాజపురం లక్ష్యలక్షణవేత్తయై రాగరూపకాలప్రుల ననన్యసాధారణంగా చేయునట్టివాడు 'భావుకుడు'. ఉ॥ పాల్ఘాటు అనంతరామ గవతార్, టైగర్ వరదాచారి. సభికుల నేదోవిధంగా రంజింపజేసి మెప్పును బడయువాడు 'రంజకుడు'. ఉ॥ రామానుజయ్యంగారు. గాయకుల పోకడల ననుసరించువాడు, ఉ॥ సీతారామాచారి. రసికగాయకవర్యులను తయారు జేసే ప్రతిభగలవాడు. 'శిక్షాకారుడు'. ఉ॥ సు. దక్షిణామూర్తి శాస్త్రి (హరి నాగభూషణంవ్యాసం) వీరిలో సంతానానికి పితృస్థానమువంటిది శిక్షాకారునిది. అట్టి యీ స్థానానికి జెందినవారు శ్రీశాస్త్రిగారు. అనేకులకు కూడు గుడ్డల నిచ్చి పోషించి విద్యాపారంగతులను జేసి తరించినవా రగుటచే 'కులపతి' నామం వీరి కర్హము. 'అన్నదానాత్పరం నాస్తి' 'విద్యాదానం తతోధికం' 'అన్నేన క్షణతృప్తి స్స్యాద్యావ జ్జీవంతు విద్యయా' అన్న సూక్తి ప్రకారం అనేక బీదవిద్యార్థులకు గానశాస్త్రమును బోధించెను. సవయస్కులును, సతీర్థులునైన ఫ్లూటు శరభశాస్త్రి వీరి వలెనే సద్గురుకటాక్షానికి బాత్రులైరి. వీరి గురుశ్రేణికి జెందినవారే పట్నం సుబ్రహ్మణ్యం మహావైద్యనాథన్, పంచాపకేశన్, వీణ ధర్మదీక్షితులు. వీరు ఆజానుబాహులును, బ్రహ్మతేజోవిరాజితులును, అనాదిగౌరవభాజనమైన అగ్రహారీకులు నగుటచే కచే

రీలు చేసి ధనార్జనకు గడంగక శిష్యబృందాన్ని ప్రోగుచేసి వారికి పాఠ్యప్రవచనాలు చేయుచూ యశస్సు నార్జించిరి.

వీరి శిష్య గణపరిగణనం. వీరి పుత్రులు ముప్వురు కృష్ణబ్రహ్మం, నాగేశ్వరశాస్త్రి, విశ్వపతిశాస్త్రిగార్లు, అంతా జంత్రగాత్రజ్ఞులు. రాజనాల వెంకటప్పయ్య, ద్వివేదుల లక్ష్మణశాస్త్రి, నరసింహంసోదర్లు, దుడ్డు సీతారామయ్య, నం. సింహాద్రప్పలాచారి, చల్లపల్లి పురుషోత్తం-పంచనాదం సోదర్లు, చల్లపల్లి సీతారామయ్య-సుబ్బయ్య సోదర్లు, పారుపల్లి రామకృష్ణయ్య, పెనుమత్స లక్ష్మీపతిరాజు, కందా రాఘవయ్య, సుసర్ల గంగాధరశాస్త్రి వగైరాలు. నిర్యాణం 1917.

రాజనాల వెంకటప్పయ్య (1860–1935) : పాండిత్య నడవడులలో గురువులను బోలిన శిష్యులు, రాగరూపకాల ప్తులు జేసి పల్లవి పాడుటలో చాకచక్యమును కనబర్చిన వారు. అనేకుల కన్నవస్త్రాదు లిచ్చి విద్యను గరపిన కులపతి. ఇతనిశిష్యులైౖ వెలసినవాడే పొన్నూరు రామసుబ్బయ్య.

ద్వివేదుల లక్ష్మన్నసోదర్లు : బొబ్బిలి వాస్తవ్యులు. వీరి గాత్రాలు త్రిస్థాయిలో సంచరించేవి. మృదువుగాను మృష్టమధురచౌ హాలాది గుణోపేతమై యొప్పి, తంబుర శ్రుతివలె స్నిగ్ధమై, మహావైద్యనాథన్ వంటి గాయకోత్తములను విస్మరింపజేసేది. లయదిట్టరు లగుటచే పల్లవి ప్రస్తారములో అమోఘశక్తిని సంపాదించి, కల్యాణిరాగంలో

కారుబారు బిల్హరిలో 'నా జీవనాధార' కృతులను పాడుటలో సమర్థులయ్యారు. భావుకశ్రేణికి చెందినవారు.

చల్లపల్లి పురుషోత్తం-పంచనాదం : వీరిలో జ్యేష్ఠులు గాత్రజ్ఞులు పిన్నలు జంత్రగాత్రిజ్ఞులు.

చల్లపల్లి సీతారామయ్య-సుబ్బయ్య : జ్యేష్ఠులు గంభీరగాత్రసంపన్నులు, ఫిడేలువాద్య నిపుణులు. సుబ్బయ్య వీణానాదాన్ని బోలు అనురణనాత్మకమైన జీవంగలదైన శ్రుతి రంజకగాత్రంగలవాడు. ఇతడు తిరువత్తూరు కుప్పయ్య, ముత్యాల్పేట త్యాగయ్యలవద్దను అనేక కృతుల నభ్యసించెను. ఇతని గాత్రమెంత హృద్యమై శ్రావ్యమై యొప్పెడిదో హృదయం కూడ అంత నిర్మలముగను ఆడంబరరహితముగను వుండేది. ఇతని గానవిశారదత్వానికి మూలభూతమైనది. గాత్రసంపదయే. ఇతని తానపద్ధతి సత్సంప్రదాయ యుక్తమును శ్లిష్టగుణోపేతమునైనది. ఆబాలగోపాలం విని సంతోషపడేవారు. ఇతని బాణిలో చోళదేశపు ఛాయలుండేవి. గౌరీమనోహరిలో 'ప్రోవసమయం' ముఖారిలో 'క్షీణమై తిరిగి జన్మించెనో' అన్న కృతులు వీరిసొమ్ము. 'నిర్దోషో మధ్యమో మతః' అను లక్ష్యభూతులు; రంజక, అనుకార, సంజ్ఞార్థులు.

కందా రాఘవయ్య : హరికథా పితామహులైన కందా రాజన్నగారి దత్తపుత్రులు. కష్టించి విద్యనుసాధించిన గాత్రవరేణ్యులు. గుంటూరుసీమలో ప్రఖ్యాతపురుషుడు.

పెనుమత్స లక్ష్మీపతిరాజు : క్షత్రియకులాలంకారు లైన గాత్రిజ్ఞుడు.

గబ్బిట యగ్గన్న (1875–1921) : ఏలూరు తాలూకా రామారావుగూడెం నివాసి. గౌతమ సగోత్రీకు లైన తెలగాణ్య బ్రాహ్మణులు. ఆజన్మబ్రహ్మచారి. పదకర్త. భక్తరచయిత. గాత్రిజ్ఞుడు. తండ్రి పేరు సూర్యనారాయణ. ఇతడు రచించిన జావళీలు ఆంధ్రదేశములోనేగాక కర్నాటక, మహారాష్ట్రి నాటకరంగములపైని కూడా వీని నకలులు ప్రచారంలోనికి వచ్చినవి. ఇతర గాయకుల కలభ్యములైన పాండిత్య ప్రతిభను సంపాదించి, పండితాదరణను బడసెను. సుప్రసిద్ధ ఫిడలరు గొర్తి లక్ష్మీనారాయణతో కలిసి అనేక చోట్ల కచేరీలను జేసెను. ఇతని శిష్యులు ఇరుగంటి బుచ్చి రామశాస్త్రి, దంపూరి సుబ్బారావు, పల్లవి సుబ్రహ్మణ్యం (తిరువయ్యారు), సత్యరాజు బ్రహ్మేశ్వరరావు (కాకినాడ), అభినేత్రులు చేటపర్రు సుందరి, పువ్వుల పాపాచలం మొదలగువారు. ఇతని గానవిద్యాగురువు కట్టు సూరన్న. ఇతడు అనేక కృతులు, జావళీలు, వేంకటేశ, భద్రాద్రిరామ శతకాలు రచించి 1921 లో కీర్తిశేషుడాయెను.

లయబ్రహ్మ పాపట్ల లక్ష్మీకాంతకవి (1877–1921) జగ్గయ్యపేట నివాసి. ఆంధ్రసంగీత విద్వన్మణులలో మేటి. దిగంతయశోవిశాలుడై రాణించెను. తన సహజ ప్రతిభా విశేషం చేతనూ, స్వతంత్ర రాగ తాళ ప్రస్తారం చేతనూ,

వివిధ విచిత్రగీతికాపాఠ్యానుభవముచేతనూ, గాంధర్వ పేటికా నన్యవాద్యవిశిష్టతచేతను, కొంతకాల మాంధ్రనాటకరంగా నికి నూత్నవికాసాన్ని చేకూర్చెను. గానస్వతంత్రులై వివిధ గీతికా నిర్మాతలై, అధ్యాపకులై, వాద్యకులై, ప్రదర్శించు చున్నపుడు భావజ్ఞశ్రోతల కమందానందమును చేకూర్చెను. మైలవరం థియేటర్‌లో ఇతని అపూర్వ భావరాగతాళ సమ్మేళనాసౌష్ఠవం అనుభవైక వేద్యము. ఇతని సహచరులుగా తబలావాద్యప్రకాండుడు బగ్గన్న, పేటికావాద్యకుడు రామా నుజులు అమృతసోనలొల్కునట్లు వాయించుచుండగా దేవేంద్ర సభవలె ప్రకాశించేది. ఇతనివద్ద తర్ఫీదు పొందని నటుడు గాని, అనుకరించని పాటపద్ధతులు గాని, ప్రసిద్ధసమాజములు కాని లేనేలేవు. పిన్ననాటను అన్నగారైన రామయ్యవద్ద సంగీత శిక్షణను బడసి సికింద్రాబాదున కేగి, అచ్చట విద్యా వంతులైన చిన్నన్న సోదరులతో పోటీ జేసి ఖ్యాతినార్జించెను. ఇతనికి 'లయబ్రహ్మ' బిరుదు సార్థకము. ఫిడేలు హార్మనీ వాద్యాలు రెంటిలోనూ గొప్పకీర్తి నార్జించి, రాజమండ్రి గున్నేశ్వరరాయల కంపెనీలోను, మైలవరం నాటక కంపెనీలోనూ సంగీతదర్శకులుగా నుండి ఉచితవేతనమును బడసెను. సదస్యులు వీరి సంగీత ప్రవీణతకు మెచ్చి బంగారు తోడాను సమర్పించిరి. విద్వత్పరీక్షలో పల్లవి వీరికి ముఖ్య వస్తువు. సంకీర్ణ ఖండజాతి తాళాలలో విషమజాగాలు కల్పించి పల్లవిప్రస్తరణ జేసి సభ్యులను చకితులను జేసేవారు. గోష్ఠీ

చంద్, కనక్తార, ప్రహ్లాద, సావిత్రి, ద్రౌపది, కృష్ణలీల, తులాభారం, పాదుక నాటకాలకు విన్నాణపు కీర్తనలను రచించి నాట్యపట్టాభిషేకాన్ని బొందారు. రసస్ఫూర్తి, పద లాలిత్యం అతీతం. ప్రథమమున నాట్యరంగంపైని హిందూస్థానీ రాగాలు ప్రచారం చేసెను. ఇతని యనంతర మిట్టి ప్రతిభా శాలి, గాయకకవి, ఆంధ్రనాట్యరంగాన్న లంకరించలేదు. ఇతని శిష్యులే పురాణం కనకయ్య, పిరాట్ల శంకరశాస్త్రి ప్రభృతులు. యాదగిరి (నిజాం) నరసింహ్యాస్వామి దేవా లయపు సంగీత పరీక్షాధికారులుగా చాలకాల ముండిరి. గద్వాల, వనపర్తి ఆస్థానములలో వార్షికములను, గౌరవ బిరుదావళులను బడసిన మహనీయుడు. నిర్యాణం : 1924.

ప్రయాగ తిర్మలయ్య (గుంటూరు) జననం 1861–మరణం 1918 : త్యాగరాజ శిష్యపరంపరకు జెందిన కోయం బత్తూరి రాఘవయ్య శిష్యుడు. మహావైద్యనాధయ్యకు సమ కాలికుడు, ఇతడు కాకినాడ గానసభలో కచేరీచేసి కీర్తి నార్జించెను. అనేకులకు గానవితరణనుజేసెను. ఇతని శిష్యుడు బలిజేపల్లి సీతారామశాస్త్రి.

చేబ్రోలు సోదర్లు (బందరు) : వెంకటరత్నం, పాపయ్యగార్లు పట్నాలపల్లవి ప్రవీణులు. అనేకగీతాలు రచించిరి. శిష్యులు కొచ్చర్లకోట రామరాజు, కంభంపాటి సత్యనారాయణ, కంచర్ల సుబ్బారావు, పాపట్ల లక్ష్మీకాంత

కవి. వెంకటరత్నంగారు అమరవాది శేషయ్యగారి శిష్యులు. (1854–1926) వీరు 1926 లో మరణించిరి.

మునుగంటి శ్రీరాములు - పానకాలు సోదర్లు : కాకినాడ : వీరు జంత్రిగాత్రనిపుణులు. సంగీతకృతిదర్పణం, స్వరవర్ణసుధానిధి గ్రంథాలు రచించి శ్రీరామమందిరాన్ని నిర్మించి అనేకసభలు చేయించి దానధర్మాలు. చేసిన దాతలు శ్రీరాములుగారి దత్తుడే శ్రీ మునుగంటి వెంకట్రావు.

రావినేని వీరయ్యచౌదరి : రాజనాల వెంకటప్పయ్య శిష్యుడు. కంజీవరం నైనపిళ్ళెవద్దను గాన మభ్యసించెను. పల్లవిప్రవీణుడు.

వెంపటి సూర్యనారాయణ : ఒంగోలు తాలూకా తమ్మవరం నివాసి. రాగపల్లవులలో నిపుణతను పొన్నూరి రామసుబ్బయ్యవద్ద సంపాదించెను.

తూములూరి హనుమచ్ఛాస్త్రి : పొ. రామసుబ్బయ్య శిష్యుడు. ఏకసంథగ్రాహి. గొప్ప హరిభక్తుడు. రామసుబ్బయ్యగారివిద్యను బాగుగ గ్రహించి తనశిష్యులగు తాడిగడప శేషయ్య, నిరాఘాటం కోటయ్యలకు నేర్పెను.

నిరాఘాటం రామకోటయ్య : పేటేరు నివాసి. మదరాసు సంగీత పరిషత్తు సభ్యుడు. ఇతను తోడికృష్ణయ్య బంధువు. ఇతని సోదరుడు ఆంజనేయశాస్త్రి తరంగకాలక్షేప ప్రవీణుడు.

వైణికశేఖర్ హరి రామయ్య : హరివంశానికి మూలపురుషుడు. మైసూర్ ఆస్థానగాయకుడు. ఇతడు పున్నాగరాగ మాలపిస్తే పన్నగాలు వచ్చినాయని ప్రతీతి. ఇతనిది ఆపస్తంబసూత్రి కృష్ణయజుర్వేద వాధూలస గోత్రిం ఈ వంశీకులు సతతము హరిని భజించుటచే 'హరి' వారని గృహనామము కలిగినది.

హరి అచ్యుతరామయ్య: వెల్లటూరు జమీందారుల ఆస్థానగాయకుడు. ఒకనాడు దర్బారులో బంగారునాణెముల పళ్ళెరమును శిరముననిడికొని గానంచేయగా రాచదృష్టిసోకి మరణించెనట. ఇతని శిష్యులు కాశీభట్ల రామయ్య, వేమూరి నరసింహం, అప్పన్నగారలు.

హరి నర్సయ్య : పట్నం సుబ్రహ్మణ్యం వద్దను గాత్రిమును, తచ్చూరి పెదసింగరాచార్ల వద్ద ఫిడేలును అభ్యసించి, 500 కృతులు, 50 తానవర్ణాలు సాధన చేసెను. పిడికిలిపట్టు వాద్య మితని విశిష్టత. ఇతని స్వాధ్యాయులు తిరుక్కోడికవల్ కృష్ణయ్యర్. సమకాలీనులు కోయంబత్తూరు రాఘవయ్య, పెదసైది వడివేలు, వైద్యనాథయ్యరు, చిరియాళ నారాయణస్వామి మొదలగు వారు. నెల్లూరి రాఘవరాజు, పల్లవి శేషయ్య, నంజుండయ్య మున్నగు మహావిద్వాంసులకు ప్రక్కవాద్యమును వాయించెను. ఇతను 10 సంవత్సరములు మానేపల్లిలో నుండెను. ఇతని కొడుకే శ్రీ హరి

నాగభూషణశాస్త్రి బి. ఏ., శ్రీ నర్సయ్య 1902 లో గతించెను.

కొచ్చెర్లకోట రామరాజు (1878–1946): గోదావరి జిల్లా ఉప్పాడలో వెంకటనారాయణ జానకమ్మగార్లకు జన్మించెను. తమ 15 వ ఏటను చెఱ్ఱోలు వెంకటరత్నంగారి శుశ్రూషనుజేసి కర్నాటకగానమును పల్లవి వరకు సాధించిరి. అనంతరం పట్నం సుబ్రహ్మణ్యం శిష్యులైన C. S. కృష్ణస్వామి వద్దను జంత్రగాత్రముల నభివృద్ధి జేసుకొనెను. ఇతని సహాధ్యాయి కంచర్ల సుబ్బారావు. 1914 లో శ్రీ రాజా కొచ్చెర్లకోట కృష్ణారావు జమీందార్ మేడలో సభను జేసి కీర్తిని స్థాపించెను. కస్తూరి శివశంకరకవి వద్దను సాహిత్య శిక్షణను బొంది స్వరజతులు, తానవర్ణాలు, తిల్లానాలు, కీర్తనలు, అష్టోత్తర కీర్తనలు రచించెను. ఇవిగాక గాయకమనో రంజని, సరళీస్వరాలనుండి పల్లవి వరకు పంచరాగమాలికలు, పదాలు, ఘనరాగ గీతాలు రచించి కృతకృత్యుడయ్యెను. తిరుపతి వేంకటేశ్వర్లు దర్బారులో బిల్హరి స్వరజతినికూర్చెను. ఇతని సోదరుడు లక్ష్మణరాజు కూడ సహగానం చేయుచుండెను.

ఇతడు భక్తుడగుటచే ప్రతి శనివారం రోజున భజన చేసేవారు. ఇతనికి మాతృపూజ, గురుపూజ, దైవపూజ, అతిథిపూజ యన్న చాలా ప్రీతి. నిరాడంబరుడు. అనేక పండితులను సన్మానించెను. భగవంతు డన్నోదకములకు

సమృద్ధిగా ప్రసాదించుటచే 1896 నుండి అనేకమంది విద్యార్థులకు గానము బోధించి తయారుజేసెను. శిక్షణాకారుల తరగతికి జెందును. శిష్యవర్గం: నడింపల్లి వెంకటనరసరాజు, అడబాల నరసింహం, షేకు బాబా, లచ్చిరాజు, పిన్నెల మల్లయ్య, వేనపల్లి నరసింహం. దేష్‌ముఖ్ కొప్పోలు జమీందార్లితనిని గౌరవించిరి. 1938లో రాజోలు వకీలు సంఘంవారు వీరికి గజారోహణోత్సవ సత్కారం మంగళ వాద్యాలతోను, ఫిడేలు నాయుడు, హరి నాగభూషణం కచ్చేరీలతో, జయజయధ్వానాలు మింటికెగసేటట్లుగా నేత్రపర్వముగా షష్టిపూర్తి జరిపిరి. నిర్యాణం : 1946.

పారుపూడి చలమయ్యశాస్త్రి (మాగాం, 1878–1954) వివిధ కళాభిజ్ఞ, తర్క–వేదాంత శాస్త్రపారీణ, గాంధర్వ విద్యోపాసక బ్రహ్మశ్రీ చలమయ్య, అమలాపురం తాలూకా మాగాం నివాసి. అచ్చయ్య – కామాంబలకు పుత్రుడుగా 1878 సం॥రంలో జన్మించెను. హైదరాబాద్‌లో అచ్చయ్యగారు ఉత్తమపండితులుగా నిర్వచింపబడి వార్షికము తీసుకొనేవారు. తండ్రితో కలిసి యితడు కూడా తర్క–వేదాంతశాస్త్రములను, అప్పాతులసీ యను మహారాష్ట్ర బ్రాహ్మణ లక్షణ వేత్తవద్దను గానమును అభ్యసించెను. ఇతడు కర్నాటక సంగీతంలో రచించిన కృతులు, తానవర్ణాలు మునుగంటి పానకాలరావు విద్యాదర్పణములో గలవు. ఇతడు కాకినాడ సరస్వతీ సభలోను, రాజమండ్రి గానసభలోను అనేక గాన

ఉపన్యాసాల నిచ్చెను. ఇదిగాక ఆంధ్ర, హిందీ, సంస్కృత, మహారాష్ట్రభాషలలో చక్కని ప్రవేశమును సంపాదించెను. అష్టపదులు, పంచపదులు, ఖ్యాలు, టుంరీ, ధృపద్ పదాలలో ప్రవీణుడు. సంస్కృతములోను, తెనుగులోను కీర్తనలను రచించి, గానమంజూషను ప్రకటించెను.

ఇతనిది సన్నని శ్రావ్యకంఠము. హిందీ కీర్తనలను గూడ రచించి పునహా గంధర్వమహావిద్యాలయములో పాడి వినిపించెను. భిన్నసంప్రదాయములలో కీర్తనలను రచించిన ఆంధ్రులు వీరొక్కరే.

వేదాంతశాస్త్ర సంపన్నులు, ప్రస్థానత్రయ పఠితలు. గీతావ్యాఖ్యానకర్తలు, ఉభయ గానలక్షణవేత్తలు, వాగ్గేయ కారులునైన చలమయ్యగారిప్రతిభ వినియోగించకుండగానే గోల్పోవుట ఆంధ్రుల దౌర్భాగ్యమని చెప్పక తీరదు.

కీ॥ శే॥ పురాణం కనకయ్యశాస్త్రి : (గుంటూరు) 16_4_1878 జననం. బ్రహ్మశ్రీ కనకయ్యశాస్త్రి ఆంధ్రులలో ప్రఖ్యాత జంత్రగాత్ర వరిష్ఠుడు. వెలనాటి వైదిక యజుశ్శాఖ గౌతమ సగోత్రోద్భవుడు. తలిదండ్రులు మంగమాంబా — పురుషోత్తంగార్లు. ఇతని తండ్రి నిష్ఠాపరుడై ఆసన్నకాలంలో మహానందీ క్షేత్రమున భగవదారాధనలో కాలము గడపెను.

ఇతని పూర్వీకులు నిజాం యిలాకా పరిటాల గ్రామ యినాందార్లు. ఇతని పైతృకవంశంవారు బ్రహ్మజ్ఞాన సంప

న్నులై శిష్యులకు జ్ఞానభిక్షను ప్రసాదించి ప్రశంసాపాత్రు లైరి. ఇతని పితామహుడు లక్ష్మీనారాయణ. సోదరుడు కనకాద్రిశాస్త్రిలు గొప్ప తపోధనులు. వేదాంతం కూచావ ధాని యను ఘనాంతస్వాధ్యాయి యితని మాతామహుడు.

చిన్నతనంలోనే యితను తన తండ్రివద్దను సంగీతంలో గణేశపూజను జేసెను.

అనంతరం పా. లక్ష్మీకాంత మహాశయునివద్దకరిగి గ్రంథపూర్తిని జేసెను. హైదాబాద్ పౌరులప్రోత్సాహించె చెన్నపురి కేగి యచ్చట శ్రీమాన్ తచ్చూరి శింగరాచార్ల వద్దను జంత్రిగాత్రాల నభ్యసించెను. ఇతని దీక్షాపాటవ మును జూచి రెంటాల వెంకట సుబ్బాయ నితనిని ఆదరిం చెను. విద్యానిష్ణాతులైన కొంతకాలాని కితడు స్వగ్రామమున కరిగెను.

1903 సం॥రంలో మరల గుంటూరున కేగి విద్యార్థు లకు బోధించుచుండెను. ఇంతలో శ్రీకుడితిపూడి శ్రీరాములు చౌదరి, నమ్మయ్యస్థాపించిన గానపాఠశాలలో 10 సంవత్సరా లధ్యాపకుడుగా నుండెను. విద్యా పాటవమునకు, గానప్రతి భకు గుంటూరు పౌరులు మెచ్చి యితనిచే కచేరీలం చేయించి సువర్ణపతకముల నొసంగిరి. ఇతను హైద్రాబాద్, గద్వాల, కనపర్తి, ఆత్మకూరు, బేతవోలు జమీందార్లచే గౌరవింప బడెను. గద్వాల సంస్థానంలో జరుగు విద్వత్సభలకు ఇతడు పరీక్షాధికారిగా నిర్ణయింపబడెను. ఇదిగాక నవాబుపేట,

యాదగిరి సంస్థానాలలో కూడ పరీక్షాధికారత్వము బడ సెను. 1921 లో మైసూరుకేగి బిడారం కిట్టప్ప, తిరువయ్యారు సుబ్రహ్మణ్యాం (సంగీతకౌముదీకర్త) నాట్యశిరోమణి వరదాచారి ప్రముఖులచేతను, మహారాజావారి చేతను గౌరవింపబడెను. 12 సంవత్సరాలు గుంటూరు శారదా నికేతనంలో అధ్యాపకుడుగ నుండెను. జంత్రగాత్రముల రెంటిలోను అద్వితీయ ప్రతిభనార్జించెను. నిరాడంబరజీవి. స్వరవిజృంభణ, నిశ్చల లయపటిమ, స్వరపల్లవులలో నిరంకుశపాండిత్యం, జంత్రగాత్రనిపుణత దైవదత్తముగా నుండి, యితని గానం సర్వాంగసుందరమై చెన్నారె నని (శ్రీ) తిరుపతికవులు, కాశీ కృష్ణమాచారిగారు ప్రశంసించిరి. నిర్యాణం 1951.

వారణాసి రామసుబ్బయ్య : పొన్నూరు 1882–1912. తండ్రి కోటయ్య. తల్లి లక్ష్మీదేవి. భార్య రోశమ్మ. నివాసం పొన్నూరు. "పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః" అన్నట్లు జీవించినది స్వల్పకాలమైనా "యశఃకాయేన జీవంతే నరో మృతోపి మతిమాన్ యశః" అన్నట్లు కీర్తిచే సజీవుడే అయ్యెను. స్ఫురద్రూపి ఆజానుబాహుడు ఆకర్ణాంత విశాల నేత్రుడు సహజసుస్వరగాత్రుడు ఆకారసదృశ ప్రజ్ఞ గలవాడు నైన యితడు రాజులను సైతము ధిక్కరించె. అంగసౌష్ఠవం గలవాడు. కౌశికగోత్రోద్భవుడు. భరతశాస్త్రప్రవీణుడును నాటకకళాచతురుడునగుతండ్రి వద్దను గాంధర్వకళానిధి ప్రతిభావంతగాయకుడు నగు రామసుబ్బయ్య సంగీత

విద్వాంసుల చరిత్రల నాకర్ణించి గానవిద్యాసక్తిని పెంపొందించుకొనెను. 15 వ ఏటనే సంగీతసభలుచేసే ప్రావీణ్యత అలవడినది. మృత్యుపర్యంతం సభలు చేయుచుండెవాడు.

బాల్యంలో ప్రకృతిధ్వనులతో కంఠమును మేళవించి పాడుచు శ్రోతల తన్మయులను జేసేవాడు. తండ్రివద్దను సరళీలు, అలంకారాలు, గీతాలను నేర్చెను. అనంతరం శ్రీ రాజనాల వెంకటప్పయ్య వద్దను 30 కృతులు, 30 తాన వర్ణాలు, పల్లవిని అభ్యసించెను.

ఇతని అపూర్వస్వరజ్ఞానం లయపటిమజూచి అంతా యితనిని గంధర్వాంశసంభూతు డనిరి.

1906 సం॥రంలో కాకినాడ గానసభలో పూచయ్యం గారిని కలిసి కదనకుతూహలం రాగంలో విషమపల్లవిని పాడి సభ్యుల నానందపరచెను. వెంటనే పూచయ్యంగా రితనిని తనతోకూడ గొంపోయెను. అయ్యంగారివద్ద పాఠము లను చెప్పుకొనుచూ రామసుబ్బయ్య గానసభల కేతెంచి విఖ్యాతగాయకుల గానములోని గుణదోషములను విమర్శించుచూ వానిని తన హృదయఫలకమున నెలకొల్పి శ్రోత లకు వినిపించి భ్రమ పుట్టించెను.

1906 లో ఎట్టియాపూర్ సంస్థానానికి పోయి సుబ్రహ్మణ్యదీక్షితుల పనుపున గ్రహ స్వరమును పాడి విన్పింపగా వీరి ప్రతిభకు మెచ్చి సంగీతసంప్రదాయప్రదర్శిని గ్రంథాన్ని కానుకగా సమర్పించెను.

1909 లో రామనాద్ సంస్థానంలో పండితశాల్వాను బహూకరణగా బడసెను. తిరుగుదలలో ధేనుకొండ చిన్నయ్య, నారుమంచి జానకిరామయ్య, ప్రయాగ తిర్మలయ్యల సమక్షంలో పూర్వ ఆధునిక లక్షణగతి గమక భేదాలను గురించి విమర్శించి చెప్పెను. కాత్రావులపల్లి రాణీగారికూతురి వివాహసందర్భంలో పండితసభలో నందిగామ వెంకన్న, సంగమేశ్వరశాస్త్రి, నారాయణదాస్ మొదలగు పండితుల సమక్షమున నిరుపమానపల్లవిని బాడి 'పల్లవికోకిల' బిరుదమును బొందెను. సేకూరులో విషమ పల్లవిని పూర్తిజేసి మాదయి వెంకట్రాయుడిని పరాభవించెను. బుచ్చిరెడ్డిపాలెంలో భైరవిరాగ పల్లవిలో అపూర్వ గ్రహస్వరాలు వినిపించి గోవిందస్వామి యను నాగస్వర వాద్యకుని మెప్పించెను.

1907 లో కలకత్తాకేగి హిందూస్థానీపద్ధతిని గ్రహించి గోహర్జాన్, జోతీంద్రమోహన్, శరశ్చంద్రమోహన్, టాగూర్లను మెప్పించి యోగ్యతాపత్రమును, సువర్ణపతకమును బహుమతిగా బడసెను. చేబ్రోలు బంగాళాలో ఋషభగ్రామంలో పాడుచున్నపుడు ఆ దారిని పోవుచున్న జోడెడ్ల బండి ఆగిపోయెను. నారాయణదాస్, సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిలవారు యితని గానమును విని గంధర్వగానమని ప్రస్తుతించిరి.

గాత్రవరిష్ఠులలో ప్రథమశ్రేణికి జెందును. ఇతని గాత్రం 'హృద్యశబ్దః సుశారీరః' అన్నటుల మృదుమధుర గంభీరమగునట్టిదన్నీ త్రిస్థానగమకప్రౌఢిగలట్టిదియును. ఇతని గాత్రంనుండి వెల్వడే ప్రసారాలు గవ్వలగుత్తులవలె ధ్వని యుతములైనవి. రాగరూపకాలప్తులకు మేటి. ఇతని గానశైలి ఎవరికీ అబ్బలేదు. ఇతని శారీరం స్నిగ్ధం, ఘనం అనుధ్వాన యుక్తం, అనాయాసలసద్గతికమునై, అనంతరామభాగవతర్ బిడారం కిట్టప్పగార్లను మరపించెడిది. ఇతనికి 'స్వరజ్ఞానస్వర కల్పనల్లరీ అర్వాచీన ఆంధ్రగాయనవాచస్పతి' బిరుదాలు సముచితములు. జంత్రగాత్రాల్లో అపారపాండిత్యధురీణుడు. స్వరకల్పవల్లి సంగీతసర్వార్థసారసంగ్రహం, సంగీతరత్నా కరం, సంగీత ప్రదర్శిని గ్రంథాల సాంతము బఠించి, ఎవ రే రాగములో ఎట్టిపల్లవిని విషమజాగాలో యిచ్చినా అవ లీలగా బాడి జూపే శక్తివంతుడు. ఏరాగంలోనైనా వర్ణాన్ని ఆశువుగా రచించి పాడే ధీశాలి. స్వరప్రస్తార ప్రతిభావంతుడు. ఇతని తానవితానం తాలుగతమైశోభించెను. విలంబ మధ్య కాలములపైని అభిరుచి యెక్కువ. భరతశాస్త్రప్రకాండు. కవిత్వం, వేదాంతం, గానం ఆజన్మవాసనాసిద్ధములైనవుడే తావన్మాత్రగురూపదేశం చేతనైనను వర్థిలి సమ్యక్ఫలశోభిత మగును. ఆ విద్యలయం దారితేరిన వారిలో ఇత డొకడు. గాత్రపాటలో పాథెఫోన్ కిచ్చిన నవరోజురాగపు వల్లవి, కల్యాణి, కాంభోజి, కరహరప్రియరాగాలాపనలు, మోహన

రామప్రియ రాగకృతుల రికార్డులిత డసదృశప్రజ్ఞాధురీణు డని చాటుచున్నవి. ఆంధ్రగీర్వాణభాషాపాండిత్యమును చాటుట కితడు భావనారాయణస్వామిపైని చెప్పిన శ్రీరాగ రుద్రప్రియ, ఆభోగి, చారుకేశి, వీణాధరి, జగన్మోహిని, కల్యాణి, ఆదితాళ, అటతాళవర్ణాలు, గీతాలు, ఖడ్గబంధాలు, నాగబంధాలు, సంగీతవిమర్శకవ్యాసాలు చాలును. ఇవి ఇతని వాగ్గేయకారత్వాన్ని స్థాపించుచున్నవి. ఇతనితో తుల్యమైన ప్రతిభావంతులు కోనేరిరాజపురం, గొర్తి లక్ష్మీ నారాయణ, చల్లపల్లి సుబ్బయ్య, పాపట్ల లక్ష్మీకాంతం, నంది గామ వెంకన్న మొదలగువారు. ఇతనికి పొన్నూరు భావ నారాయణస్వామి కోవెలలో స్వస్తివాచకపు నౌఖరీవుండెను. ఒకనాడు వాసిరెడ్డి ప్రసాదరావుజమీందార్, చివుకుల వెం కటప్పావధాని ఘనాపాఠిగారితో కలిసిరాగా సుబ్బయ్య శిజేలుపైని పనస చెబుతూ వాయిస్తూవుంటే విని తనశిష్యుని చాతుర్యాన్ని అవధానిగారు మెచ్చారు.

కేవలగ్రహణశక్తియే ఇతన్ని యిట్టి ప్రజ్ఞావంతునిగా జేసినదని చెప్పడానికి ఇతడు సంతతం విజయనగరం, తంజా వూర్, చెన్నపట్నం మొదలగు పట్టణాలను సంచారం చేయడమే కారణం. అఖండకీర్తి నార్జించిన గాయకవిద్వా న్మణులలో ఇత డగ్రగణ్యుడు.

మదరాసు, తంజావూర్ మొదలగు పట్టణాలలోని గానవిద్యాలయాల వలె ఒక సంస్థను స్థాపించి పొన్నూరును విద్యానిలయమును చేయడానికి కితడు చందాలు ప్రోగుచేసెను.

ఇతని శిష్యవర్గం : తూములూరి హనుమచ్ఛాస్త్రి, ఐరాఘూటం రామకోటయ్య, వెంపటి సూర్యనారాయణ, తాడిగడప శేషయ్య, రావు సూరయ్య, మాధవరావు, లంక లింగయ్య, కోడూరి హులక్కి, అంబడిపూడి సుబ్బయ్య, పొన్నూరి ముసలయ్య, రావు వెంకటూ్రావు, చల్లా పిచ్చయ్య శాస్త్రి. వీరిలో వర్ధమానగాయకుడై శేషయ్య మృతుడయ్యె. గానరచనా విన్నాణంస్వరప్రస్తరణ అమోఘములు. ఇతడు 'సంగీత రహస్య ప్రబోధిని' అను గ్రంథమును వ్రాసెను.

మరణాత్పూర్వం జార్జిపట్టాభిషేకానికి ఢిల్లీకి పోయి పాటకచేరీ చేయవలెనను కుతూహలంతో ముఖమల్ అంగరఖాను కుట్టించుకొనెను. పిమ్మట విదేశయానమునకై పుచ్చా సీతారామయ్య జమీందార్ ద్వారా ప్రయాణ పత్రాన్ని తెప్పించుకొనెను. ఈ లోపున విధిదుర్విపాకంచే జయపుర ఆస్థానం నుండి తిరిగి వచ్చుచూ చలిజ్వరబాధచే పీడితుడై మదరాసు ఆస్పత్రిలో చనిపోయెను. 'ఆంధ్రులు చేతకానివాడు' అన్న అపకీర్తిని బాపుటయే ఇతని ఆశయం. ఇతనికి దక్షిణ జైత్రయాత్ర కేగి అరవలను ఓడించవలెనని ఆశ గలదు. దానిని శ్రీ హరి నాగభూషణమున కుపదేశించెను. ఇతని సంగీతం ఆజన్మసిద్ధం. కారణమాత్ర గురుప్రవర్తితం. 'మాటలు కోటలు దాటును. చేతలు కేతనం దాటవు' అన్న పరిహాసభాజనుడుగాడు. శామసుబ్బయ్య నిర్యాణం : 1912.

కాశీభట్ల లక్ష్మణశాస్త్రి : గరికిపర్తి కోటయ్యదేవర శిష్యుడు. కస్తూరివారి సావరం నివాసి. పిన్ననాటనే ఫిడేలు, గాత్రము నభ్యసించి కోడి, శుద్ధసావేరి రాగాలలో వర్ణములు రచించి అనేకులకు విద్యాదానం చేసిరి. ఇతనికి కామేశ్వర రావు, గణపతి, కాశీపతి అను ముగ్గురు కొడుకులు గలరు. వీరంతా విద్యావంతులే. తబలా, హార్మోనియం, ఫిడేలు వాద్య నిపుణులు. 1944 లో మరణించిరి.

చంద్రాభట్ల కనకయ్య : మారుటేరుదగ్గర తామరాడ అగ్రహార నివాసి. కళ్యాణి, ఖమాచి, బిలహారి, వసంత, శంకరాభరణం, భైరవి రాగాలలో స్వరజతులను వ్రాసిరి.

పారుపల్లి రామకృష్ణయ్య పంతులు (1883–1951) 1883 లో స్వభాను వత్సరం ప్రాచీన ఆంధ్ర రాజధానియైన శ్రీకాకుళంలో శేషాచలం, మంగమాంబలకు జన్మించెను. శ్రీవత్సస గోత్రోద్భవుడు.

1902 లో తెనుగురాయుల పాలెమునకు కరణీకమును జేసి, 1906 లో పనికి రాజీనామా నిచ్చెరి. గానకళ ఇతని హృదయకుహరమున మెరుపువలె మెరసెను. ఆ తళుకులో యితనికి శ్రీ సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రి చరణయుగములు నవవికసితపద్మముల వలె మనోహరములై గానవచ్చెను. తచ్చరణములే యితనికి శరణ్యమాయెను. ఆ నిర్వేదం స్నేహమై యితని విజ్ఞానదీప్తిని ప్రజ్వరిలజేసెను.

ఇతడు శాస్త్రిలవారివద్ద గురుకులావాసం జేసి 12 ఏండ్లు గానమభ్యసించెను. నమ్రత, బుద్ధిసూక్ష్మతలచే గురువుల అభిమానమును జూరగొని, గురువే పరదైవతమ్మని భావించి ధ్యానించుచూ గురూపదేశమునే మనన మొనర్చుచూ చరితార్థుడయ్యెను.

తదుపరి కాకినాడ గానసభకేగి అనుభవమును గడించుకొని అనేక పర్యాయాలు దక్షిణదేశ పర్యటన మొనర్చి, కళారహస్యముల నవగాహన జేసికొనెను. దక్షిణదేశ భ్రమణము చేయునపుడు తిరువయ్యారులోని శ్రీ త్యాగరాజస్వామివారి ఆరాధనోత్సవాల కేగి బూదలూరి కృష్ణమూర్తిశాస్త్రి గోటువాద్య కచేరీలో ఫిడేలు నైపుణ్యమును బ్రదర్శించి, మాంగుడి చిదంబర భాగవతార్, పంచాపకేశ ఖ్యున్నగు విద్వత్ప్రముఖులచే ప్రశంసింపబడెను. ఇతని గానకళాప్రౌఢిని ఏతత్కళావరిష్ఠు లెంతయో మెచ్చుకొనిరి. వాయులీన వాద్యములో నిపుణుడు. సున్నితమైన గాత్రజ్ఞుడు. శాంతశమదమాది సద్గుణగరిష్ఠుడు. శుద్ధవాణి శుద్ధముద్ర యితని విశిష్టత. శాస్త్రిలవారి శిష్యకోటిలో మేటికీర్తి నార్జించిన గాయకుడు. సుమారు 40 ఏండ్లనుండి ఆంధ్ర తమిళ దేశములలో గొప్పకీర్తి మర్యాదలను బడసెను.

1916 లో గురువుగారిని వెంబడించి బరోడా సంగీత పరిషత్తునకు బోయి బొంబాయి ఆంధ్రసమాజము వారిచే మన్నింపబడెను.

1931 లో నర్సారావుపేటలో పిరాట్ల శంకరశాస్త్రి అధ్యక్షతను జరిగిన సారస్వత పరిషత్తులో వీరికి 'గాయక సార్వభౌమ' బిరుదము ప్రసాదింపబడెను.

1933 లో చెన్నపురి సంగీత పరిషత్తు వారితనిని విద్యా ప్రవీణ సలహా సభ్యులుగా నెన్నుకొనిరి.

1943 లో వీరి షష్టిపూర్తి విజయవాడలో అత్యంత వైభవంతో జరిగెను.

1917 లో త్యాగరాజ శతవార్షికోత్సవమును వైభవంగా జరిపిరి. త్యాగరాజ సంగీతపరిషత్తును విజయవాడలో స్థాపించి దానితరపున ప్రతిఏట పండితసభలు వాగ్గేయకారుల వార్షికోత్సకములు జరుపుట ప్రారంభించిరి. అనేకులు వీరి ప్రజ్ఞాప్రాభవముల నుద్దీపింపజేసెడి స్వర రాగ తాళ భావ ప్రవృత్తులు ప్రజ్ఞాసమన్వితములని వాకు్రిచ్చిరి. వీరు అనేక గాయకసభలకు అధ్యక్షులుగా నుండిరి. తిరువయ్యారు, పునహా, మదరాసు పట్టణములలో కచేరీలు చేసి గౌరవమును బడసిరి. ప్రస్తుతం వారిశిష్యులు రామకృష్ణగాంధర్వవిద్యా పీఠమును వీరిపేరిట బెజవాడలో నిర్వహించుచున్నారు.

శిష్యవర్గం : శ్రీ చిలకలపూడి వేంకటేశ్వర శర్మ, మంగళంపల్లి మురళీకృష్ణ, వంకదారి వెంకటసుబ్బయ్య, దాలిపర్తి పిచ్చిహరి, ధూళిపాళ సోదరీమణులు, వంగల వాణీభాయమ్మ, శ్రీమతి యశోదమ్మ, లక్ష్మీనరసింహ శాస్త్రి, శిష్టా రాజశేఖరశాస్త్రి మున్నగువారు పెక్కురు.

గలరు. ఇతని సహపాఠులు వెంపటి వెంకటకృష్ణయ్య, చల్ల పల్లి పంచనదేశ్వరం, ద్వివేదుల లక్ష్మన్న, దుడ్డు సీతారామయ్య, చల్లపల్లి సుబ్బయ్య, దాలిపర్తి రామస్వామి మొదలగువారు.

దుడ్డు సీతారామయ్య 1883–1951. ఇతడు అధ్యాత్మ రామాయణ – అష్టపది – తరంగ ప్రవీణులైన దుడ్డు కామ శాస్త్రి, సుబ్బమ్మలపుత్రుడై 1883 లో జన్మించిరి.

బాల్యమునుండి సంగీతాభిరుచి వుండుటచే తండ్రి వద్ద సంగీతాభ్యాసమును జేసి, స్వరరాగ జ్ఞానము లలవరుచ్చ కొనెను. తాను సముపార్జించిన గానవిద్యతో తనివిజెందక దేశాటనం జేసి రెండుమూడేళ్ళలోనే అనేకులు గురువులవద్ద గానరహస్యములను నేర్చి వుండిరి. ఇతడేకసంతగ్రాహి యగుటచే గానవిద్య అవలీలగ ప్రాప్తించెను. ఎట్టకేలకు సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిచెంతకుబోయి 4 మాసాలలో విద్యాసంపూర్తిని గావించి, మదరాసులో తిరువత్తూరు త్యాగయ్య వద్దను నూతనవిషయములను గ్రహించి జంత్రి గాత్రాలలో అసమానప్రజ్ఞను సంపాదించెను.

ఇతని ప్రత్యేకగానవిశిష్ఠత ఏమనగా 3 తరగతుల సంగీతావధానమును చేయుట. వేదమూల అష్టావధానం, గణితావధానం, సంగీత అవధానం. సంగీతావధానమనగా రాగ, తాళ, కాల, జాగా, గతి, జాతి భేదములు చేసి గాత్ర ముతో పాడుతూ ఫిడేలును వాయించుట. గణితావధానం

అనగా కోరినజాగాలలో షట్కాలాలలో రెండుచేతులతోను తాళములువేసి కాలమును మార్చి వ్యస్తాక్షరీ ఘంటనాదము లతో కలిపి అవధానం చేయుట. వీరు పదపద్యకవితలలో సమస్యలను పూరించిరి.

పిఠాపురం రాజాగారి దర్బారులో సంగీత గణిత అవ ధానం చేయుచుండగా మద్రాసుగవర్నరు 24 అక్షరాలుగల వ్యస్తాక్షరీనిచ్చి సమాధానమును బడయుటచే వీరిని గౌరవిం చగా రాజావారు వీరిని తన ఆస్థానములో నుండమని కోరిరి. స్వతంత్రజీవి గనుకను ఈవరకే 10 ఆస్థానములలో వార్షికము లుండుటచేతను నౌఖరీ కొప్పుకొనలేదు.

కాకినాడలో చల్లా సుబ్బారావు సింహతలాటపు మురుగులజతను, పత్రి రామచంద్రరావు స్వర్ణకంఠమాలను యిచ్చిరి. పామర్రుగ్రామంలో సంగీతపుపోటీలో 1116 రూప్యములు గెలిచెను. మాడుగుల సుబ్బారావు యితనికి జంగారెడ్డిగూడెం వద్దనున్న పట్టెన్నపాలెంలోనూ శ్రీరామ పురంలోను యః॥ 50 ములు మొఖాసా నిచ్చిరి. గోడేవారి ఎస్టేటులో ఆహిరి రీతిగౌళ రాగాలు అద్భుతంగా పాడి ఓలేటి కామరాజుపంతులుచే యః॥ 200 ల భూమిని శాశ్వతదాన పట్టాను బడసెను. నూజివీడులో మీర్జాపురం రాజావారి వివాహసందర్భంలో అష్టావధానంలో పలుసేని రాగాలాపన చేసి వారిని మెప్పించి మహామహోపాధ్యాయ బిరుదమును బడసెను. ఇతనివద్ద ప్రాచీన లక్షణ గీతాలు ప్రబంధాల

సంగ్రహ ముండెను. ఇతడు నిశితప్రజ్ఞాధురంధరుడు, విద్వద్వ రేణ్యుడు. ఇతని పుత్రులు పుత్రికలు కూడా అంతా గాన వేత్తలే. ఇతని శిష్యులలో ముఖ్యుడు నుహేంద్రవాడ బాపన్నశాస్త్రి, విజరం.

పిరాట్ల శంకరశాస్త్రి 1884 – 1950 . తారణసంవ త్సర భాద్రపద శుద్ధ చతుర్దశీ పుణ్యదినంబున శ్రీ శైల శాస్త్రి పిచ్చమాంబలకు జన్మించెను. ఇతని జన్మస్థలం నంది గామ తాలూకా జయంతిపురం గ్రామం. తండ్రి ఆంధ్ర గీర్వాణ భాషా పండితులు, దేవీఉపాసకులు. ఇతనికి మృత్యుం జయశాస్త్రి, శివరామశాస్త్రి, సదాశివశాస్త్రి అను ముగ్గురు సోదరులు. మృత్యుంజయశాస్త్రి సాహిత్య నాటకాలంకార విమర్శకులు. సదాశివశాస్త్రి బాల్యములోనే చనిపోయిరి.

శ్రీశంకరశాస్త్రి నిష్ఠాగరిష్ఠుడు, నిరాడంబరుడు, శివ పూజాధురంధరుడు, సంగీతసాహిత్యవేత్త. చిరకాలము శ్రీవామదేవతీర్థ స్వాములవారి శుశ్రూషను జేసి వేదాంత శాస్త్రములో మంచిఉపన్న అనుభవములను సంపాదించి పంచకావ్యములవరకు చదివి తేటతెనుగులో కబ్బముల నల్ల నేర్చి భక్తితత్పరతతో శంకరశతకమును రచించిరి. ప్రథమ మున పాపట్ల లక్ష్మీకాంతంగారి వద్ద గానాభ్యాసమునుజేసి పిమ్మట వీణ కుప్పయ్య కొడుకు ముత్యాలపేట త్యాగయ్య వద్దను పాండిత్యమును గడించిరి. అనంతరం విజయనగరం గద్వాల వనపర్తి ఆత్మకూరు ముక్త్యాల సంస్థానాలలో విద్యా

ప్రదర్శనము గావించి పారితోషికాలు బడసిరి. కొంతదనుక గుంటూరులో నివసించి విద్యాప్రదానం జేస్తూ, ముక్త్యాల ఆస్థానవిద్వాంసులుగా మరణపర్యంతం వుండిరి.

కొన్నివత్సరాలు మదరాసు సంగీతపరిషత్సభ్యులుగా నుండి దాక్షిణాత్యుల కేవిషయములోను తీసిపోక కామవర్ధని షణ్ముఖప్రియ, భైరవి, సింహేంద్రమధ్యం రాగాలలో తాము రచించిన కీర్తనలను పాడి సంగీతరత్నాకరములోని విషయాలు విశదీకరించిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ్యులుగా నెన్నుకొనబడిన వారిలో ప్రథములు. వీరు గాత్రపాటలో నేకాక వీణ, ఫిడేలు, మృదంగవాద్యంలో కూడ ప్రవీణులు. ద్వితీయ సంగీతపరిషత్తునకు అధ్యక్షపదవిని జేసిరి. వీరికిద్దరు కొడుకులు, మహాదేవశాస్త్రి, శ్రీగిరిశాస్త్రి అనువారు గలరు.

పిరాట్ల శివరామశాస్త్రి: బాల్యములో వేదాధ్యయనమును జేసి పాపట్ల కాంతయ్యవద్ద సంగీతము నభ్యసించి అసదృశ ప్రజ్ఞాధురీణులై, గాత్రసాధకులై ఫిడేలు మృదంగ వాద్యాలలో జాతి పల్లవులను కోరినరీతి బాడి వాయించి హైదరాబాద్ మదరాస్ పట్టణాలలో కీర్తినార్జించిరి. ఇతనికి సేనాని శాస్త్రి అను కొడుకు గలడు. జననం 1880.

బలిజేపల్లి సీతారామశాస్త్రి 2–9–1885 జననం. సహజసంగీతానికి సరసకవితకు బలిజేపల్లివారి వంశం ఆంధ్ర రాష్ట్రంలో చిరమగుకీర్తిని సంపాదించినది. బలిజేపల్లి నర

సింహశాస్త్రి - ఆదిలక్ష్మమ్మలకు పుత్రుడుగా జన్మించెను. నరసింహశాస్త్రి సంగీతసాహిత్యవిద్యాసంపన్నుడు. ఆదిలక్ష్మమ్మ అధ్యాత్మం, తరంగం, అష్టపదులుగానముచేయుటలో సమర్థురాలు. నాట్యవేదికపైని హృద్యమైనసంగీతమునుబాడి రక్తికట్టించి గుంటూరుబాణీని నిర్మించిన బహుళనాటకకర్త కవితాకళానిధి లక్ష్మీకాంతకవి యితని సోదరుడు. చిన్ననాటనే అన్నగారి వద్దను నాట్యశిక్షణను పొందిన సీతారామయ్య, అద్వితీయ గానప్రతిభా ధురంధరుడు కోయం బత్తూరి రాఘవయ్యగారి ప్రముఖశిష్యుడైన ప్రయాగ తిరుమలయ్య వద్ద శుశ్రూష జేసి గానము నభ్యసించెను. అట్టి ఉదాత్తమైన గానసంప్రదాయములో ఉపనీతుడై తన సంగీత ప్రసక్తిని వికసింప జేసుకొనగల్గిన మేధావి సీతారామయ్య. పూచయ్యంగారు, కోనేరి రాజపురం ఆదిగాగల ప్రఖ్యాత గాయకుల గానధోరణిని విని స్వతంత్రధోరణిలో గానం చేసెను. ఇతనిగానం శుద్ధతంజావూరి బాణీకి చెందినది. రాగ భావం, మనోహరమగు సంగతులు, సహజస్వరపోకడలు, సంచారాలు, సద్యస్ఫురణ మున్నగు శుభలక్షణ విలసిత ములు. ఎప్పటికప్పుడు నూతన ప్రస్తారాలలో విలసిల్లునట్టి గానంగాని ఒకేమాదిరి చిట్టస్వరాలతో కూడినదికాదు. గానములో యితనికిగల సంస్కారప్రాబల్యం, ప్రతిభ, అనన్యమైనవి గనుకనే పండితపామరవేద్యముగనుండి ఆంధ్రదేశమునందేగాక అరవదేశంలోకూడా ఆకర్షణీయమై రాజిల్లెను.

1917 లో చెన్నపట్టణంలో కా॥ నాగేశ్వరావు పంతు లితని నాహ్వానించి సభలో స్వర్ణకంకణ ప్రదానము జేసెను. శ్రీనివాసయ్యంగా రితనికి 'గానవిద్యాధురంధర' బిరుదును ఆంధ్రరత్నగోష్ఠి సభవారు 'గానకళాప్రపూర్ణ' బిరుదును నారాయణదాసు 'స్వరసింహ' బిరుదునిచ్చి పూజించిరి. కవిత్వ జ్యోతిషాలలో నైపుణ్యంవున్నది. 1944 లో భక్తకల్పద్రుమ శతకాన్ని రచించెను. ఆసంవత్సరమే యితని షష్టిపూర్తి వైభవముతో జరిగెను. వీరిశిష్యులు మహావాది వెంకటప్పయ్యశాస్త్రి, దెందుకూరి శివరామయ్య, పన్నాల వెంకటప్పయ్య.

తాడిగడప శేషయ్య : 1888_1950 : సంగీతవిద్వద్రంజకస్వరనిధి బిరుదాంకితు డగు శ్రీ శేషయ్య ఒంగోలు తాలూకా రావూరులో జన్మించెను. పొన్నూరులో పాతూరి రామయ్య వద్దను కాళిదాసత్రయమును పూర్తి జేసెను. గానాభిరుచి కలవాడగుట సహజసంగీతధోరణిని పద్యాలు రసవత్తరముగ పాడుచుండెను. మాతామహుడు, తల్లి సంగీత పాటకులగుటచే యితనికి సంగీత మయాచితముగా నబ్బెను. ఇతడు గర్భస్థ శిశువుగా నున్న తరి యితని తల్లి వకనాటి ప్రాతఃకాలమున మేల్కొల్పులు పూర్వరాగసంచారములో బాడుచున్నతరిని ఆ వూరికి వేంచేసిన గాయకు డొకడు ఈర్ష్యచే చిత్తచాంచల్యప్రయోగము జేసెను. ఏతత్ఫలితంగా గర్భములోనున్న శేషయ్యకు కూడ మనోభ్రమణం కల్గెను.

పొన్నూరిలో తూములూరి హనుమచ్ఛాస్త్రి వద్దను కొన్ని గీతాల నభ్యసించి ఏకసంధగ్రాహి యగు నితడు వారణాసి రామసుబ్బయ్య కృతులను గానమర్మములను అభ్యసించెను. ఒకనాడుదయం శేషయ్య రామసుబ్బయ్య పెరటిలో స్నానంచేస్తూ తోడిరాగము నాలపింపగా గురువు విని యితడు తన భవిష్యత్కర్త యని భావించి స్నేహితులకు నివేదించెను. తదాదిగ శేషయ్య అనేక కచేరీలు చేసి చల్లపల్లి, మీర్జాపురం రాజులచే సంభావింపబడెను. శ్రీ త్యాగయకృతులను భావపూరితముగా పాడేవా డితడొక్కడే యని పేర్గాంచెను. స్వరరాగతాళ జ్ఞానమును కల్గి రాగాలాపనలో బహుచతురుడుగ గణింపబడెను. ఎల్లప్పుడున్మత్తునివలె తిరుగాడువాడు. నిర్యాణం 1950.

గాత్రజ్ఞుల, వాగ్గేయకారుల జీవితములు లభించినంత దనుక యిందులో పొందుపరచడమైనది. తంత్రీవాద్యవేత్తలు, మార్దంగికులు మొదలైన జంత్రజ్ఞుల జీవితములు, ఆయా సంగీతసాధనముల విశేషములు త్వరలో రాబోవు ద్వితీయ భాగములో పొందుపరుపబడినవి.



మెజస్టిక్ ప్రెస్ - రాజమండ్రి.

# విశ్వసాహిత్యమాల - రాజమండ్రి

## సంపాదకులు :- మహీధర జగన్మోహనరావు

| | | |
|---|---|---|
| మానవులు : మహీధరములు—ఎమ్. ఇలిన్ & సెగాల్ | 5 | 0 |
| జనులు : మహాజనులు— ,, | 5 | 0 |
| జ్ఞాన : విజ్ఞానం — ,, | 5 | 0 |
| యక్షప్రశ్నలు—శాస్త్రీయగ్రంథం—మూడోకూర్పు—బొమ్మలతో | 2 | 8 |
| ప్రకృతి : గతితర్కం — ఏంజిల్సు | 0 | 10 |
| వానరుడు — నరుడు : పరిణామక్రమంలో కర్మపాత్ర ,, | 0 | 6 |
| దక్షిణపవనం — ఎల్మర్ గ్రీన్ — స్టాలిన్ ప్రైజ్ నవల | 4 | 8 |
| నాడు — నేడు — అడయంకో — నవల — రెండోకూర్పు | 4 | 0 |
| ప్రతీకారజ్వాలలు — నవల — రెండోకూర్పు | 1 | 0 |
| నా బాల్యం (గోర్కీ ఆత్మకథ) | 5 | 0 |
| విజ్ఞాని పాలోవ్ — మహావిజ్ఞాని జీవితం | 2 | 8 |
| గోర్కీ జీవితం — రెండోకూర్పు — బొమ్మలతో | 2 | 0 |
| లెనిన్ జీవిత కథలు — మూడోకూర్పు — బొమ్మలతో | 1 | 0 |
| చెకోవ్ కథలు — 13 కథలు — 238 పుటలు | 2 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు — పది కథలు — నాల్గవకూర్పు | 2 | 0 |
| మపాసా కథలు — 19 కథలు 240 పుటలు | 2 | 0 |
| గోర్కీకథలు — ఆరు కథలు — 160 పుటలు | 1 | 8 |
| ప్రపంచకథలు — వివిధదేశాల కథలు — చక్కనివి | 1 | 0 |
| చీనాకథలు — ఆస్వాల్డ్ ఎర్ట్‌బర్గ్ — రెండవకూర్పు | 1 | 0 |
| డిప్యూటీ చైర్మన్ — చీనావిప్లవ కథలు | 1 | 0 |
| టాల్‌స్టాయ్ జీవితం — 2వ కూర్పు | 1 | 0 |
| ఛాయ — పది నాటికలు — ముద్దా విశ్వనాథం | 2 | 0 |
| ఇండియా — మార్క్సు, ఏంజిల్సు లేఖలు : రెండవకూర్పు | 1 | 0 |
| వ్యవసాయ సామెతలు — నేదునూరి గంగాధరం సంకలనం | 0 | 12 |
| శ్రీ భద్రాచలక్షేత్ర చరిత్ర — బొమ్మలతో — రచన :— శ్రీ కొండపల్లి రామచంద్రరావు | 1 | 8 |

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రుల చరిత్ర — ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ. | | 1 | 8 |
| యూదుల చరిత్ర — | ,, | 1 | 8 |
| ఆంధ్రగాయకుల చరిత్ర — మం. రా. శాస్త్రి | | 1 | 0 |
| విప్లవ సందేశం — నాలుగో కూర్పు | | 0 | 8 |
| బలిదాన్ — లియోనిడ్ లియోనివ్ — నాటకం | | 1 | 0 |
| ఆచరణ | మావో | 0 | 6 |
| ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం | ,, | 0 | 8 |
| వైరుధ్యములు | ,, | 0 | 12 |
| కారల్ మార్క్స్ ఉపదేశాలు — లెనిన్ | | 1 | 0 |
| రష్యా విప్లవం 1905 | ,, | 1 | 4 |
| రాజ్యాంగయంత్రం | ,, | 0 | 4 |
| వామపక్ష కమ్యూనిజం | ,, | 2 | 0 |

## అవంతీ ప్రచురణలు, రాజమండ్రి

| | | | |
|---|---|---|---|
| రథచక్రాలు — రాజకీయ నవల | | | |
| రచన:—రామమోహన్. 504 పుటలు క్రౌన్ సైజు | వెల | 5 | 0 |
| ఓనమాలు—నవలరామమోహన్. | | 2 | 8 |
| వినోదము—విజ్ఞానము—మహీధర నళినీమోహన్ యమ్. ఎస్. సి. | | 1 | 0 |
| నూరేండ్లక్రిందట 1857 చరిత్ర | | 1 | 8 |

## విజయభారతీ పబ్లికేషన్స్, రాజమండ్రి వారి

శబ్దసింధు — హిందీ — తెలుగు నిఘంటు 1300 పుటలు

డెమ్మీ 1/8 సైజు, గ్లేజుకాగితం, క్యాలికో బైండ్ వెల 12 0

## విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

ANDHRA GAYAKULA CHARITRALU. Rs. 1/-

# ఆంధ్రుల చరిత్ర

వెల రూ 1-8

రచయిత : శ్రీ ఖండవిల్లి బాలేందుశేఖరం, ఎం.ఏ.

"ఆంధ్రులు ఎవరు? అన్న ప్రశ్న నుంచి రాష్ట్ర పునర్నిర్మాణసంఘం సిఫార్సులవరకు ఆంధ్రుల చరిత్రను స్థూలంగా సమీక్షించారు. వివిధప్రాంతాలలో వర్ధిల్లిన ఆంధ్రరాజ్యాలు, వాటి క్షీణదశ, ముస్లిం పరిపాలన, జాతీయోద్యమం, రాష్ట్రోద్యమం అన్నీ వివరించారు. ప్రాచీనకాలపు ఆంధ్రరాజ్యాలలో ప్రజల స్థితిగతులు, ఆచార వ్యవహారాలు చక్కగా తెల్పుతున్నారు. విద్యార్థుల కెంతయో ఉపయోగకరమైన పుస్తకం."

— ఆంధ్ర పత్రిక : 4-11-56.

చక్కని ముఖచిత్రం — 3 దేశపటములు — గ్లేజు కాగితముపై 160 పుటలు.

# శ్రీ భద్రాచలక్షేత్ర చరిత్ర

వెల రూ 1-8

రచయిత : శ్రీ కొండపల్లి రామచంద్రరావు.

"భద్రాచల పుణ్యక్షేత్రాన్ని గురించి విన్న అనేక కథలను, చరిత్రను చేర్చి విపులంగా అత్యంత భక్తిప్రపత్తులతో వ్రాసిన యీ వ్యాసావళి మొదట ఆంధ్రపత్రికలో ప్రకటితము... సర్వజనులకూ బోధపడే విధంగా విషయాలను గ్రంథస్థం చేసిన శ్రీ రావుగారి కృషి ప్రశంసనీయం...... అతి సరళమైన భాషలో, చదివేవారికి భక్తి ఆదరాలను కలిగించే విధంగా వ్రాశారు."

— ఆంధ్ర పత్రిక : 21-4-1957.

పెద్దల ప్రశంసలతో, అనేక పటములతో గ్లేజు కాగితంపై ముద్రింపబడినది — 150 పుటలు.

---

## విశ్వసాహిత్యమాల-రాజమండ్రి

Title Printed at Bharathi Press, Rajahmundry.